# ఇండియా భవిష్యత్తు



కె. రాధాకృష్ణమూర్తి బి. ఏ.

రినైజన్స్ పబ్లికేషన్స్,
తెనాలి.

# ఇండియా భవిష్యత్తు

## యుద్ధానంతర భారత సమస్యలు

146

1943 అక్టోబరులో
గుంటూరు జాకోబిన్ లాడ్జిలో జరిగిన రాజకీయ
పాఠశాలలో యిచ్చిన ఉపన్యాసం



కె. రాధాకృష్ణమూర్తి, బి. ఏ.

THE ANDHRA BOOK HOUSE,
SULTAN BAZAR HYDERABAD-DN.

# జోస్యం

అప్పుడే ప్రెస్సునుంచీ బైటపడింది రాధాకృష్ణమూర్తి వ్రాసిన "ఇండియా భవిష్యత్తు" చేతిలోని పుస్తకంచూసి ఒకాయన "ఎవరండీ ఈ రాధాకృష్ణమూర్తిగారు, ఇండియాలో విప్లవం వ్రాసినవారేనా" అని అడిగాడు.

"అవును ఆయనే. ఇండియాలో విప్లవం మీరుచదివారా?" అన్నాను.

"చదవకేం. ఒకటికి రెండుసార్లు చదివాను. ఉత్త Fiction రాశాడు. ఆయన రాజకీయాల్లో జోస్యం బాగా చెప్పేటట్లున్నాడు." అన్నాడు.

"ఇండియా భవిష్యత్తు" అని పేరుచూడగానే నాతో మాట్లాడుతున్నాయనకు హస్తసాముద్రికమో, జ్యోతిష్యమో గుర్తుకు వొచ్చివుంటుంది. అందుకనే తడువుకోకుండా 'రాజకీయ జోస్యం' అనగలిగాడు. రాధాకృష్ణమూర్తి ఇంతకుముందువ్రాసిన "ఇండియాలో విప్లవం" పుస్తకాన్ని గురించి అనేకులు అనేక విధాలుగా విమర్శ చెయ్యటం నేనెరుగుదును.

ఇండియాలో' విప్లవం' మాటేమోగాని ఆ పుస్తకం ఆంధ్ర దేశంలో పెద్ద విప్లవం తెచ్చినమాట వాస్తవమే.

"ఇది వుత్త బూటకం. ఇండియాలో మన కళ్ళముందు విప్లవం జరుగుతూ ఉందట. ఇంతకంటె విడ్డూరం యింకే ముంటుంది. ఇండియాకు స్వాతంత్ర్యం యీ నిమిషంలోనో మరో

నిమిషంలోనో పుట్టాడి పడబోతుందట. మేం పుట్టిందగ్గరనుంచీ కళ్లు తెరుచుకొనే వున్నాంగదా మరి మాకు కనబడదేం దానిదుంప తెగ ఆ విప్లవం" అన్నవాళ్ళు చాలామంది నాకు తటస్థపడ్డారు.

"ఈ పుస్తకం నాలో ఎంతపని చేసింది. నాకు రాజకీయాలంటే ఏమిటో ఇండియాలోవున్న నిజపరిస్థితు లేమిటో, అంతర్జాతీయ రాజకీయాలతో మనం ఎందుకు ముడిబెట్టుకోవాలో, యిండియాలో ప్రస్తుతం నిజమైన విప్లవవాదులెవరో, విప్లవ వ్యతిరేకులెవరో, యిన్ని విషయాలు తెలుసుకోగలిగాను యీ పుస్తకం చదివి. ఇదివరకు రాజకీయాల్లో పాల్గొనటమంటే తెల్లవాళ్ళను ద్వేషించటం, నాయకుణ్ణి పూజించటం, ఖద్దరుటోపీ పెట్టుకొన్న వాడికి ఓటివ్వటం యింతేననుకొనేవాణ్ణి. భారతదేశంలోని ఆర్థిక పరిస్థితులివనిగాని, ఆర్థికరంగంలో మనల్ని పీక్కుతినే వాళ్ళనే రాజకీయరంగంలో మన జాతీయనాయకులు అని చెప్పి పూజిస్తున్నామనిగాని, ఆ నాయకులుగూడా దాన్ని మరిపించటానికే నల్ల, తెల్లరంగు భేదాలు మనలో రెచ్చగొడుతున్నారనిగాని యీగోడే తెలిసేదికాదు. ఈ పుస్తకం నాలో ఎంతమార్పు తీసుకొచ్చింది." అన్నవాళ్ళూ నాకు కనపడ్డారు.

80 పేజీల చిన్నపుస్తకం ఒకటి, పాఠకుల్లో, ముఖ్యంగా రాజకీయాభిలాషుల్లో యింతచంచలనం కలిగించింది అంటే, ఆ రచయిత పుస్తకం వ్రాయటంలో వుద్దేశించిన ఆదర్శంచాలా వరకు నెరవేరినట్లేనని నా అభిప్రాయం.

రాజకీయాలను శాస్త్రీయంగా అవలోకించి, అర్థంచేసుకొని పనిచేసే రాజకీయవాదులు మనకు ఎట్లాకరువయ్యారో, శాస్త్రీ

యుద్ధకృథంలో వ్రాయబడ్డ సరియైన రాజకీయ గ్రంథాలుగూడా అట్లాగేలేవు మనకు.

అట్లాంటి కొరత తీర్చవలసిన బాధ్యత యీనాటి రచయితలపై ఎంతోవుంది. రచయితలు వుద్రేకానికి కట్టుబడి రాజకీయ గ్రంథాలు రచించినందువల్ల సాధించే ప్రయోజనం ఏమీ ఉండదు. కాకపోతే అట్లాంటి పుస్తకాలు ఆ రచయితకు స్వాతంత్ర్యాకాంక్ష ఎంతవుందో, వున్న ప్రభుత్వం అంటే ఎంతమంటో తెలుసుకోటానికి వుపకరిస్తయ్యేగాని యింకెందుకూ పనికిరావు. అట్లాంటి పుస్తకాలను యింకా నిగ్గదీసి చదివితే, ఆరచయిత భావకవిత్వం రాస్తానికి పనికివస్తాడో. రాడో, గూడా తేల్చుకోవచ్చు. అంతకుమించి ఆ పుస్తకాలవల్ల దేశానికి ఎట్లాంటి ప్రయోజనం వుండదు.

రాజకీయ గ్రంథాలను వ్రాసేటప్పుడు రచయిత ఆత్మగతమైవున్న తన దురభిమానాలను, ద్వేషాలను, యిష్టానిష్టాలను ప్రకోపించుకొని వాటినే వెల్లడించటానికి పూనుకోకుండా, ఒక సైంటిస్టు మాదిరిగా, వున్న పరిస్థితులను అర్థంచేసుకొని, ఆపరిస్థితులకు కారణాలేమిటో, ఆపరిస్థితుల్లో ఏవిధంగా నడుచుకోవాలో, అవి మారాలంటే ఏంచెయ్యాలో చెప్పాలి. అట్లాంటి సమయాల్లో ఆ రచయితకు యిష్టంలేని అనేక విషయాలను కొనియాడవలసి వుండొచ్చు; యిష్టంవున్న విషయాలను విమర్శించవలసి వుండొచ్చు; కాని చేసి తీరాలి. అంతర్జాతీయ దృక్పథం ప్రచారంలోవున్న యీ రోజుల్లో మన రచయితలు గాని, రాజకీయవేత్తలుగాని జాతీయ దురభిమానానికి కట్టుబడి

ప్రయోజనంలేదు. మనకుగూడా అంతర్జాతీయ దృక్పథం అల
వడితేనే మన రాజకీయ సమస్యలను అర్థంచేసుకోగలం. ఆదృష్టి
లేకపోతే మన సమస్యలు మనకే అర్థంకావు.

ఈ దృష్టి యీనాడు మనకు ముఖ్యంగా కావాలంటాడు
రాధాకృష్ణమూర్తి. ఈదృష్టితో ఆలోచించితే యుద్ధానంతరం,
ఇండియాలో ఏర్పడే పరిస్థితులవల్లగాని, యింగ్లండులో ఏర్పడే
పరిస్థితులవల్లగాని, అంతర్జాతీయ పరిస్థితులవల్లగాని, మనమీద
బ్రిటన్ పెత్తనం చెయ్యటానికివీలు కనుపించటంలేదు. కనుక అని
వార్యంగా మన పరిపాలన మనమీదే పడుతుంది. అప్పుడు
ప్రజాశ్రేయస్సుకు పాటుపడే ప్రభుత్వాన్ని నెలకొల్పటానికి విప్లవ
వాదులు యిప్పటినించే జాగర్తగా పనిచెయ్యాలి అనిగూడా
అంటున్నాడు. కాని యీ విధమైనవాదన చాలా విడ్డూరంగా
కనపడుతుంది అందరికీ.

ఇంగ్లండులోవున్న మిల్లుయజమానో, వ్యాపారస్థుడో బాగా
దెబ్బతిన్నాడంటే దానిఫలితంగా భారతదేశంలో పెద్ద మార్పులు
జరగవచ్చునని చెబితే విశ్వసించేవాళ్ళు వుండరు. మరొక
విషయం. అమెరికా అధ్యక్షస్థానానికి యీసారిజరిగే ఎన్నికల్లో
వెండల్ విల్కీ గెలిచాడంటే దాని దుష్ఫలితాలు ఒక్క బ్రిటిష్
భారతదేశాలకేగాకుండా, ప్రపంచానికంతటికీ కాస్తో, కూస్తో
సంక్రమిస్తాయి అనిఅంటే నమ్మకపోగా నవ్వేవాళ్ళు చాలామంది
వుంటారు. దీనికి కారణం యింతకుముందే చెప్పాను. మన
దేశంలో రాజకీయాల్లో పాల్గొనేవాళ్ళు చాలామందివున్నా,
శాస్త్రీయదృక్పథంతో, ప్రపంచరాజకీయాలు ఎట్లా నడుస్తు

న్నయ్యో, మనం ఏవిధంగా నడుచుకోవాలో తెలిసి పనిచేసే వాళ్ళు చాలా తక్కువ.

కనుకనే, యింగ్లండులో పెట్టుబడిదారీవిధానం యీ యుద్ధ కారణంగా తిరిగి కోలుకోలేనంతగా దెబ్బతిన్నది గాబట్టి యీ యుద్ధానంతరం మన దేశాన్ని బానిస దేశంగా అట్టిపెట్టుకోవలసిన అవసరం బ్రిటన్‌కులేదు, అని ఎవరన్నా వ్రాస్తే చాలామందికి హాస్యాస్పదంగా కనపడుతుంది. యుద్ధానికిముందు బ్రిటన్ దేశం యొక్క అంతర్జాతీయ వ్యాపారం 'Favourablebalance' లో వుండేది గనుక అప్పుడు బ్రిటన్ దేశం భారతదేశంలాంటి దేశాలను శాశ్వతంగా ఆర్ధిక బానిసత్వంలో ( unpayable debt ) వుంచటానికి తంటాలుపడేది, యిప్పుడు బ్రిటన్ దేశంయొక్క అంతర్జాతీయ వ్యాపారం 'unfavourable balance' లో పడింది గనుక యుద్ధానంతరం బ్రిటిష్ దేశం, మన దేశాన్ని కాళ్ళ కింద అట్టిపెట్టుకుంటానికి అవకాశం వుండదని వాదిస్తే నమ్మే వారే వుండరు. అంతేగాదు. ఒక విపరీత పరిస్థితిలో, యీ నాడు మనం దూషించే బ్రిటన్ దేశంలోని పెట్టుబడిదారులే భారతప్రజల స్వాతంత్ర్యంకోరకు కృషిచెయ్యటం, దానికి వ్యతిరేకంగా మనదేశంలోని జాతీయవాదులనబడే దేశీయ పెట్టుబడిదారులు, అమెరికా పెట్టుబడిదారులతో చేతులు కలిపి పని చెయ్యటం జరగవచ్చునని చెబితే ఎవరికీ నమ్మబుద్ధి పుట్టదు పైగా ఆ రచయిత అర్ధంలేనిజోస్యం చెబుతున్నాడనో, జాతీయతకే భంగంకలిగించి దేశద్రోహానికి పూనుకొన్నాడనో అంటారు

కాని జాతీయవాదంలో నమ్మకంలేని రాధాకృష్ణమూర్తి, నేను దేశంలోవున్న పరిస్థితులివి అంటాను. అట్లాంటప్పుడు ఆయన జోస్యం చెబుతున్నాడని అందరూ గోలకెత్తటంలో ఆశ్చర్యం ఏమీలేదు. కాని నాతో మాట్లాడుతున్న ఆ మిత్రుడు గూడా రాజకీయ జోస్యంఅని ఎగతాళి చెయ్యటం సబబుగా కనిపించలేదు. ఎందుకంటే ఆయన మాటలసందర్భంలో తను మార్క్సిస్టునని ఏవో కూలీసంఘాల్లో పనిచేస్తున్నానని చెప్పాడు. మార్క్సిస్టు అంటే అంతర్జాతీయ దృక్పధం కలిగి, చరిత్రతో సంబంధంవున్న రాజకీయ శాస్త్రకారుడని నా వుద్దేశ్యం. అటువంటివాడు ఎప్పుడూ డైలెక్టికల్‌గా ఆలోచిస్తూ వుండాలి గదా అతనికే సంఘంయొక్క laws of motion లో నమ్మకం లేకపోవడం శోచనీయం.

"మరి అయితే నీ లెఖ్ఖప్రకారం మార్క్సిజం చెప్పే historical determinism గూడా జోస్యం అవాలిగదా?" అన్నాను.

ఆ ప్రశ్నకు అతనిదగ్గరనించీ జవాబే రాలేదు.

"మార్క్సిజం జోస్యం అయితే 'ఇండియా' భవిష్యత్తుగూడా జోస్యమే అవుతుంది" అన్నాను. దానికీ అత నేమీ చెప్పలేదు. కాని పోతూపోతూ మాత్రం 'జోస్యానికి తగిన వ్యాఖ్యానం' అంటూ దాటిపోయాడు.

పరిచయం వ్రాస్తానికి పూనుకొని జోస్యం చెబుతున్న నా అసహాయ స్థితిని మీరూ గుర్తించే వుంటారు. క్షమించాలి.

ఒక్క పరిచయవాక్యం వ్రాస్తాను. ప్రస్తుతం యింగ్లండు, యిండియాల్లో ఏర్పడుతున్న ఆర్థిక పరిస్థితుల మూలకంగా, యుద్ధానంతర భారతదేశం స్వతంత్రదేశం అయిపోతుంది; అందుకు అంతర్జాతీయ పరిస్థితులుగూడా దోహదమిస్తాయి అంటున్నాడీ రచయిత. దాన్ని మీరు జోస్యం అంటారు. కాని నేడువున్న పరిస్థితులే అవి. మీరు నమ్మినా, నమ్మకపోయినా చరిత్ర తన గమనాన్నిమాత్రం సాగిస్తూనే వుంటుంది. మీకు, నాకు నమ్మకం చిక్కేవరకు చరిత్ర విశ్రాంతి పుచ్చుకొంటుం దంటే కల్ల.

జనవరి 14
1944

పి. వి. సుబ్బారావు
తెనాలి.



అంకితం

తిరపతి రాయుడికి



# ఇండియా భవిష్యత్తు

ఇవాళ మనం 'ఇండియా భవిష్యత్తు'ని గూర్చి చర్చించ బోతున్నాం. అంటే భావిభారతప్రజానీకం యెలావుండాలి అనే విషయాన్ని మనం చర్చించవలసివుంది. జాతీయవాదులదృష్టిలో యీ ప్రశ్న అంత ముఖ్యమైంది కాదు. వారుచెప్పేది ముందు మనం స్వరాజ్యం(?)కోసం కృషిచేద్దాం. తరువాత యేం చేయాలో అప్పుడు విచారిద్దాం అంటారు. యింతవరకు మన స్వాతంత్ర్యపోరాటం యిదే పంథాలో నడవటంచేత మనం యేమీ సాధించలేకపోయాం. ప్రజలు తమకు యేంకావాలో తెలుసుకోలేనప్పుడు, వారికేంకావాలో చెప్పేబాధ్యత విప్లవ వాదులమీద వుంది. వున్న పరిస్థితులు అర్థంచేసుకోవాలి. ప్రజల్లో వున్న అజ్ఞానాన్ని తొలగించాలి. వారికి రాజకీయ చైతన్యం కలిగించాలి. ఇలా జరగనంతకాలం మన స్వాతంత్ర్య పోరాటం ఫలించదు. వక్రమార్గాల్లో నడుస్తుంది.

ప్రజల్లో చైతన్యం కలిగించాలంటే ముందు మనం అన్ని విధాలా విజ్ఞానం పొందివుండాలి. జాతీయ, అంతర్జాతీయ పరిస్థితుల్ని అర్థంచేసుకోవాలి. సంఘం యే పరిస్థితుల్లోవుందో, యేంచేస్తే సంఘం బాగుపడుతుందో తెలుసుకోవాలి. ముందు వీటిని కూలంకషంగా తెలుసుకొని తరువాత ప్రజలకు బోధించటం ముఖ్యం. అలాకాకుండా తెలిసీ, తెలియని రాజకీయా

లతో ప్రజల్లో ప్రచారం చేయటానికి బయలుదేరితే యిటు మనం సాధించేది లేకపోగా అటు ప్రజల్ని మోసంచేయటం, మనల్ని మనం నాశనంచేసుకోటం జరుగుతుంది. కనుక మనం దీన్ని దృష్టిలోపెట్టుకొని యథార్థ పరిస్థితుల్ని తెలుసుకోటానికి ప్రయత్నించాలి.

సాంఘికంగా మనదేశం చాలా వెనుకబడివుంది. జమీందారీ-విధానం యింకా మనదేశంలో అలాగేవుంది. యితర దేశాల్లో నానాటికీ రైతుజనాభా తగ్గుతూ పరిశ్రమలు హెచ్చుతూంటే మనదేశంలో దీనికి వ్యతిరేకంగా రైతుజనాభా నానాటికి వృద్ధిచెందుతుంది. నూటికి 80 మందికి పైగా భూమిని ఆధారంచేసుకుని దానిమీదవచ్చే ఫలసాయంతో జీవించవలసి వస్తుంది. యీ జీవించేవారికందరికీ కూడా యీ భూమిమీద పండే పంటలు వారి స్వంతం అనుకోటానికి వీల్లేదు. యీ ఫలసాయంలో యెక్కువభాగం పనిపాటలు చేయకుండా, రాజభోగా లనుభవించే భూస్వాములకు, జమీందారులకు పోతుంది. రైతుకు మిగిలేది తనప్రాణం నిలుపుకోటానికి, తన కుటుంబం చావకుండా బ్రతకటానికి కొంత భత్యంలాగా యివ్వబడుతుంది. తక్కిన ప్రాంతాల్లోకూడా రైతు చాలవరకు యిదే పరిస్థితుల్లో వున్నాడు. శిస్తులభారంతో, ఋణభారంతో రైతు నలిగిపోతూ వుంటాడు. పండే పంటలు తక్కువ. పొలంలో బలంపెట్టటానికి, ఎరువులు వేయటానికి తాకతుండదు. కష్టపడినంతగా ఫలితం రావటంలేదు.

సంఘం యిలా వున్నంతవరకూ, అంటే కేవలం ప్రజానీకం భూమిమీాద ఆధారపడివున్నంతవరకూ శ్రమకు తగ్గట్టు ఫలితం వుండదు. పారిశ్రామిక అభివృద్ధి లేనప్పుడు ప్రజానీకం అంతా భూమిమీాదే ఆధారపడవలసి వుంటుంది. జనాభా పెరిగినకొద్దీ యీా వొత్తిడి యింకా జాస్తి అవుతుంది. పండించే రైతుకి గిట్టింపువుండదు. పనిచేసే కూలివానికి అసలే వుండదు. తన కుటుంబంమాటటుంచి తన జీవితానికి సరిపొయ్యే కూలికూడ దొరకదు.

జమీాందారీ విధానం వున్నంతవరకూ సంఘం యిలాగే వుండకతప్పదు. జమీాందారీ విధానంలో పరిశ్రమలు అభివృద్ధి చెందటానికి వీల్లేదు. పరిశ్రమలు అభివృద్ధి చెందితే మానవ శ్రమ కొంత పరిశ్రమల కోసం వినియోగపడవలసి వస్తుంది. భూమిమీాద వొత్తిడి తగ్గుతుంది. దీనివల్ల పొలంలో పని చేసేవారికి కూలి పెరగటానికి వీలుంది. కాని, భూస్వాములకు జమీాందారులకు ఫలసాయంలో వచ్చేలాభం తగ్గుతుంది. కనుక వీరు పరిశ్రమల్ని అభివృద్ధికాకుండా చూస్తారు.

మొత్తంమీాద చూస్తే మనదేశం యీా పరిస్థితుల్లోవుంది. కాని అంతర్జాతీయ పరిస్థితులు మారినకొద్ది మనదేశంలోకూడా యిష్టంవున్నా, లేకపోయినా కొన్ని మార్పులు జరక్కతప్పింది కాదు. ప్రజానీకాన్ని దోచుకోటానికి యీా పైవర్గాలకు తోడుగా ధనికవర్గం మరొకటి బయలుదేరింది. జమీాందారీ విధానంతోపాటు పెట్టుబడిదారీ విధానంకూడా రావటంచేత ప్రజానీకం మరీ దారిద్ర్యావస్థలో పడవలసివచ్చింది. వీటికి

తోడుగా ప్రభుత్వంకూడా వీటి పునాదులమీద నిర్మించబడటం వల్ల దేశంలో దారిద్ర్యం తాండవిస్తుంది.

ఇక్కడ ప్రతి విషయాన్ని విపులంగా చెప్పటం కష్టం. కనుక స్థూలంగాచూస్తే నేడు మన సంఘం యీ పై వర్గాల క్రింద నలిగిపోతుందని చెప్పవచ్చును. మనం స్వాతంత్ర్యం కావాలంటున్నామంటే ప్రజానీకం యీ వర్గాలనుంచి కూడా స్వాతంత్ర్యం పొందాలి. కేవలం బ్రిటిషుప్రభుత్వం యిక్కడ నుంచి పోయినా యీ జమీందారీవిధానం, పెట్టుబడిదారీ విధానం వున్నంతవరకూ ప్రజానీకం యెప్పటిలాగానే వుంటుంది. కాదు, యింకా హీనస్థితికూడా పోవచ్చు. కారణం ప్రభుత్వం వీరి చేతుల్లో కొస్తే వీరు ప్రజానీకాన్ని దోచుకోటానికి ఏఆటంకం వుండదు. ఇద్దరు కలిసి ఒకదానిమీద పెత్తనం చేయటం కంటె ఒకడే పెత్తనం చేయటం యెక్కువ సులభం.

కనుక భారత ప్రజానీకం దారిద్ర్యావస్థనుంచి విముక్తి చెందాలంటే పరప్రభుత్వం తొలగటమే కాకుండా మనదేశంలోని సాంఘిక, ఆర్థిక పరిస్థితుల్లోకూడా విధిగా మార్పులు జరగాలి. జమీందారీ, పెట్టుబడిదారీవిధానాలు వున్నంతవరకు మనదేశ పరిస్థితులిలాగే వుంటై. నిజమైన స్వాతంత్ర్యం పొందాలంటే వీటిని తొలగించాలి.

## అంతర్జాతీయ పరిస్థితులు

సంఘం బాగుపడాలంటే వీటిని తొలగించాల్సిన అవసరం వుంది. కాని మనం అనుకున్నంత తేలిగ్గా వీటిని తొలగించ

లేము. కారణం యీ పై వర్గాలకు కావలసినంత బలం వుంది. ప్రజల్ని మోసంజేసి వారిని తమక్రింద బానిసలుగా అట్టిపెట్టుకునే తెలివితేటలున్నవి. యెదురు తిరిగితే అణిచేశక్తివుంది. ఇదివొక ప్రత్యేక దేశలక్షణంకాదు. అంతర్జాతీయంగా యీ వర్గాల్లో సంఘీభావంవుంది. అంతర్జాతీయ దృక్పథంతో యీ వర్గాలు అధికారాన్ని తమచేతుల్లో అట్టిపెట్టుకొని, ప్రజానీకాన్ని బానిసత్వంలో వుంచటానికి ప్రయత్నిస్తూంది. కనుక నేడు సంఘం బాగుపడాలంటే దానికోసం జరిగే పోరాటం దేశీయ పొలిమేర్లలోనే జరగటంలేదు. ఒకదేశంలోజరిగే ప్రజావుద్యమం అంతర్జాతీయంగా జరుగుతుంది. ఒకదేశంలో ప్రజా-వుద్యమం గెలిచి, అక్కడి పెట్టుబడిదారీవిధానం పోతే తక్కినదేశాల్లోని ప్రజానీకంకూడా అచ్చట యెదురుతిరగటానికి ప్రయత్నిస్తుంది. అంటే వొకదేశంలో పెట్టుబడిదారీవిధానం పోతే తక్కినదేశాల్లోని పెట్టుబడిదారీవిధానాలక్కూడా దెబ్బే. కనుక అవి ఒక దేశంలోని పెట్టుబడిదారీవిధానం పోకుండా చేయటానికి దానికి కావలసిన సహాయంచేస్తవి. దీనికి మనకు కావలసినంత రుజువుంది.

అంతర్జాతీయంగా విప్లవవ్యతిరేక శక్తులు యీ విధంగా సంఘీభావంతో వున్నప్పుడు విప్లవశక్తులుకూడా విజయం పొందాలంటే అంతర్జాతీయంగా సంఘీభావం పొందాలి. లేకపోతే ఆధునికపరిస్థితుల్లో యేదేశంలోనూకూడా విప్లవం నెగ్గదు. మార్క్సు సిద్ధాంతం ప్రకారం వర్గకలహం మానవ సంఘంలో మొదటినుంచీ వస్తున్నా యిప్పుడు తీవ్రరూపం దాల్చిందని మనం తెలుసుకోవాలి.

కనుక మనం యిండియా భవిష్యత్తునిగూర్చి ఆలోచిస్తున్నా మంటే కేవలం జాతీయ దృక్పథంలోనే ఆలోచించకూడదు. మన పై వర్గాలకు అంతర్జాతీయదృక్పథం వుంది. వారికి అంతర్జాతీయంగా ప్రజల్ని అణచటానికి సహాయం వస్తుంది. మనం జాతీయ దృక్పథంలోనే వుంటే విప్లవం జరపలేము. సంఘాన్ని ముందుకు తీసుకొనివెళ్లలేము. కనుక మనంకూడా అంతర్జాతీయ దృక్పథంతో పరిస్థితుల్ని ఆలోచించి అంతర్జాతీయంగా మనం యెలాంటి సహాయాన్ని పొందటానికి వీలుందో తెలుసుకొని ఆ సహాయంతో మనదేశంలో విప్లవాన్ని జయప్రదం అయ్యేటట్లు చెయ్యాలి.

ఆధునికయుగంలో అంతర్జాతీయ పరిస్థితులకు మరీ విలువ యేర్పడ్డది. రష్యాలో సోషలిజం వచ్చిందంటే దాని పలుకుబడి ప్రపంచంఅంతటా వ్యాపించింది. ప్రపంచంలోని పీడితప్రజానీకానికి సోషలిజం వొక మార్గదర్శి అయింది. ప్రతిదేశంలోనూ ప్రజలకు అలాంటిప్రభుత్వం కావాలనే దృష్టి యేర్పడ్డది. జర్మనీలో ఫాసిజంవచ్చిందంటే ప్రపంచంలోని పెట్టుబడిదారీవర్గాలు అలాంటిప్రభుత్వం వస్తేనే తమకు మేలు వుందనుకుంటున్నవి. రేపు యింగ్లండులో ప్రజాప్రభుత్వం వస్తే దానిప్రభావం తక్కిన ప్రపంచంమీద పడకపోదు. కాబట్టి ఆధునికయుగంలో యే దేశంలో యేం జరిగినా దాని ఫలితాలు తక్కిన ప్రపంచానికూడా వర్తిస్తున్నవి.

ప్రజల్లో అంతర్జాతీయదృక్పథం యేర్పడితే తమకు యేం కావాలో, యెవరి సహాయం పొందాలో తెలుసుకుంటారు.

యిది ప్రజల్ని పీడించే వర్గానికి నష్టదాయకం. కనుక వారు ప్రజల్లో అంతర్జాతీయదృక్పథం లేకుండా చేయటానికి జాతీయ వాదాన్ని, 'నాదేశం, నాజాతి' అనే మమకారాన్ని యెక్కించి తమపని తాము గప్-చిప్‌గా చేసుకుపోతూవుంటారు. యిలా చేయటంవల్ల వాళ్ళ అధికారం వాళ్ళకు సుస్థిరంగా వుంటుంది. ప్రజలు బానిసత్వంలోనేవుండి తమకు వూడిగం చేస్తూవుంటారు. కనుక విప్లవవాదులు చేయవలసిన ముఖ్యకర్తవ్యం—ప్రజల్లో జాతీయవాదాన్ని నాశనంచేసి అంర్జాతతీయవాదాన్నికల్గించాలి.

## ప్రస్తుత యుద్ధం

చరిత్రలో యే దేశంలోనైనా వొక సంఘటన జరిగిందంటే దానిఫలితాలు తక్కిన దేశాలక్కూడా వర్తిస్తవని చెప్పాను. ఇప్పటి యుద్ధంకూడా అలాంటిదే. యీ యుద్ధంలో భావిప్రపంచ ఆధిపత్యంకోసం వొకపక్క విప్లవశక్తులు, మరోపక్క విప్లవ వ్యతిరేక శక్తులు పోట్లాడుతున్నై. యీ యుద్ధంతో సంబంధంలేకుండా మనం దూరంగా వుంటామనుకోండి. కాని అంత మాత్రంచేత యీ యుద్ధఫలితాలు మనకు వర్తించవనుకోటం పొరపాటు. జర్మనీగెలిచి రష్యా వోడిపోతే యేంజరుగుతుంది? ప్రపంచమంతా ఫాసిజం రావటానికి వీలుంది. యిండియాలోని జమీందారులకు, పెట్టుబడిదారులకు లాభం కలుగుతూంది. అలాకాకుండా రష్యా గెలిచి జర్మనీవోడిపోతే యేంజరుగుతుంది. ప్రపంచంలో సోషలిజం రావటానికి వీలుంటుంది. యిండియా లోని ప్రజానీకానికి మేలు కలుగుతుంది.

ఇప్పటి పరిస్థితుల్ని బట్టి ఫాసిజం వోడిపోతుందని, ఫాసిస్టు వ్యతిరేకశక్తులు గెలుస్తయ్యని మనకు దృఢనమ్మకం యేర్పడింది. కాని మనంకూడా మన భాధ్యతని నెరవేర్చకపోతే భావిభారత ప్రజానీకానికీ, తద్వారా ప్రపంచ ప్రజానీకానికీ చేయగలిగినంత మేలు చేయలేకపోగా మన ఆదర్శాన్ని కూడా నెరవేర్చుకోలేము. మనం యిండియాలో ప్రజానీకం బాగుపడటానికి వున్న సాంఘిక, ఆర్థిక వ్యవస్థల్ని తొలగించాలంటున్నాం. నేడు జరిగే అంత ర్జాతీయ పోరాటంకూడా యిదే. వున్నవ్యవస్థని నిల్పుకోటానికి విప్లవవ్యతిరేక వర్గాలు వొకప్రక్క చేరినై. నూతన వ్యవస్థ కోసం విప్లవవర్గాలు మరోపక్క చేరినై. కనుక మన బాధ్య తేంటో నేను చెప్పనక్కర్లేదు.

యుద్ధం అంత్యదశకొచ్చింది. ఫాసిస్టుశక్తులు వోడిపోతై అని కూడా మనకు తెలుసు. కాని మనం జోక్యం లేకుండాదూరంగా వుంటే ప్రయోజనం శూన్యం. పైగా మన వ్యతిరేకవర్గాలు చేసుకునేపని చేసుకుంటున్నై. ఫాసిస్టుశక్తుల్ని వోడించటానికి అంతులేని మానవశ్రమ వెచ్చింపబడుతుంది. రక్తంధార పోస్తు న్నారు. లక్షలకొలది యుద్ధభూమిలో చచ్చిపోతున్నారు. గాయపడుతున్నారు. కోట్లకొలది ఫ్యాక్టరీల్లో పనిచేస్తున్నారు. యుద్ధపరికరాలు, విమానాలు, టాంకులు, నౌకలు నిర్మిస్తు న్నారు. రాత్రింబగళ్ళు తీరికలేదు, నిద్రలేదు. యిదంతా యెందుకు? ఫాసిస్టుశక్తుల్ని నాశనం చేయటానికి, ప్రపంచాన్ని, మానవసంఘాన్ని అభివృద్ధికి తీసుకొని వెళ్ళటానికి. యుద్ధానం

తరంకూడా ప్రపంచం యిదే పరిస్థితుల్లో వుంటే? కనుక దేని కోసం యీ యుద్ధం జరుగుతుందో ఆ ఆదర్శంకూడా నెరవేరి నప్పుడే మానవసంఘం ఉచ్ఛదశకు వెళ్ళుతుంది. మనిషిని మనిషి పీక్కుతినే యీ వ్యవస్థని నిర్మూలించి, అందరూ సమానంగా జీవించే అవకాశాలు కల్పించటమే యీ ఆదర్శం.

యీ యుద్ధంవల్ల అంతర్జాతీయంగా మనం యెంతో అనుభవాన్ని సంపాదించాము. అంతర్జాతీయంగా కలిగే ఫలితాలు కూడా మనకు వర్తిస్తవి. అంతర్జాతీయంగా ఫాసిస్టుశక్తులు వోడిపోతే అది మనక్కూడాలాభం. కనుక యీ పరిస్థితుల్ని అర్థం చేసుకొని మనదేశంలో సంఘం అభివృద్ధి చెందటానికి కావలసిన మార్గాన్ని మనం అవలంబించాలి. క్లుప్తంలో చెప్పాలంటే మన విప్లవపోరాటాన్ని ప్రపంచప్రజాస్వామిక శక్తులతో జోడించాలి. మనదేశంలోని ప్రజాస్వామిక శక్తులకు తగినంత బలం లేనప్పుడు తక్కిన ప్రపంచ ప్రజాస్వామికశక్తుల సహకారం పొందటం అవసరం. లేకపోతే దేశంలోని జాతీయశక్తులు, ప్రజాస్వామికశక్తుల్ని నాశనం చేస్తవి. మన ఆదర్శం నెరవేరదు. సంఘం బాగుపడదు. ముందుకూడా యిలాగే వుంటుంది.

యీ యుద్ధఫలితంగా అంతులేని మానవశ్రమ వెచ్చించబడుతుందని చెప్పాను. యుద్ధానంతరం తిరిగి ప్రపంచ పునర్నిర్మాణంకోసం యెంతో మానవశ్రమని వెచ్చించవలసివస్తుంది. యీయుద్ధంలో పూర్తిగా పాల్గొంటున్న దేశాలు ముఖ్యంగా ఐరోపాఖండం అంతా యీ యుద్ధంకోసమే తమ శక్తినంతా

వినియోగిస్తున్నై. లక్షలకొద్దీ జనం చచ్చిపోవటం, వికలాంగు లౌటం కూడ మీకు తెలుసు. కనుక యుద్ధానంతర ప్రపంచ పునర్నిర్మాణంలో యిప్పుడు పూర్తిగా యుద్ధంలో పాల్గొంటున్న దేశాలు తగినంత పాత్రని నిర్వహించలేవు. కారణం కావలసి నంత మానవశ్రమ వినియోగించలేవు.

కనుక యుద్ధానంతర ప్రపంచ పునర్నిర్మాణంలో యిండియా యెక్కువ పాత్ర నిర్వహించవలసి వుంటుంది. యీ మాటలు మీకు అతిశయోక్తిగా కనబడవచ్చు. కాని వున్న పరిస్థితులివ్వి. 40 కోట్ల జనాభా వున్న భారత దేశాన్ని, అందులో యింత వరకూ మానవశ్రమని తగినట్లుగా వుపయోగించుకోలేని భారత దేశాన్ని మర్చిపోతే యుద్ధానంతరం నూతనవ్యవస్థని నిర్మించటం కష్టం— కాగా భారతదేశాన్ని దూరంచేస్తే యుద్ధానంతర ప్రపంచనిర్మాణం, నిర్మాణంకాదు. కనుక యేవిధంగాచూచినా భారతదేశానికి, భారతదేశంలాగా యింతవరకు పరిశ్రమలు అభివృద్ధిచెందని యితర దేశాలకు యెక్కువ ప్రాముఖ్యం వస్తుం దనుకోటంలో ఆశ్చర్యంలేదు. తిరిగి ప్రపంచాన్ని 1939 నాటి పరిస్థితుల్లో వుంచుదామనుకుంటే యిలాగే వుండొచ్చు. కాని ఆ పరిస్థితులు దాటిపోయినై. ప్రపంచం తిరిగి 1939 నాటికి పోదు. నూతననిర్మాణం అవసరం. అందులో భారతదేశానికి యెక్కువ ప్రాముఖ్యం వుంటుందనుకోటంలో సందేహంలేదు.

కనుక అంతర్జాతీయ పరిస్థితుల్నిబట్టి భారతదేశం ముందుకు వెళ్ళుతుంది గదా అని మనం యిక్కడ చూస్తూ కూర్చుంటే

లాభంలేదు. మనం యిక్కడ నిర్వహించవలసిన బాధ్యత చాలావుంది. యిలా భారతదేశంలో మార్పులువస్తే దేశీయ జమీందారీవర్గానికీ, పెట్టుబడిదారివర్గానికీ నష్టం. కనుక ఆ వర్గాలు యీ నూతన నిర్మాణాన్ని వ్యతిరేకిస్తవి. భారత దేశాన్ని ప్రపంచంతో సంబంధంలేకుండా చేయటానికి ప్రయత్నిస్తవి.

యుద్ధానంతరం నూతనవ్యవస్థ నిర్మించాలంటే మనదేశంలో అనేక మార్పులు జరగాలి. యింతవరకూ భూమిమీద వున్న వొత్తిడిని తగ్గించాలి. పరిశ్రమలు విపరీతంగా పెంచవలసివుంది. వ్యవసాయాన్ని ఆధునికపరిస్థితుల్లో పెంపొందించాలి. యిలా జరగాలంటే ప్రజల్లో కొనుగోలుశక్తి వుండాలి. వారి జీవిత పరిమాణం హెచ్చించాలి. అంటే ప్రస్తుతం యిండియాలోవున్న సాంఘిక, ఆర్థికపరిస్థితుల్ని పూర్తిగా మార్చివేయాలి. మనం కోరేదికూడా యిదే. కాని దీనివల్ల పై వర్గాలకు నష్టం అని చెప్పాను. కనుక మనం ప్రపంచంమీద భారంవేసి చేతులు ముడుచుకొని కూర్చుంటే దేశంలోని యీ వర్గాలు సంఘాన్ని యిదే పరిస్థితుల్లో అట్టిపెట్టుతవి. మన ఆదర్శం నెరవేరదు.

కనుక భారత ప్రజానీకం, తద్వారా ప్రపంచ ప్రజానీకం అభివృద్ధిచెందాలంటే మనం చేయువలసిన కృషి చాలావుంది. భారతదేశంలో ప్రజాస్వామిక శక్తుల్ని పెంపొందించాలి. ప్రజల్లో జాతీయవాదాన్ని తొలగించి అంతర్జాతీయంగా కలుగుతున్న మార్పులు బోధించాలి. దేశం ప్రస్తుతం యేస్థితిలో వుందో, బాగుపడాలంటే యేస్థితికి వెళ్ళాలో చెప్పాలి.

యింతవరకు పరప్రభుత్వంక్రింద వున్న భారతదేశ భవిష్యత్తు యిది అని నేను చెప్పితే మీలో కొంతమందికి యింకా సందేహాలుండవచ్చును. మనం యింకా పారతంత్ర్యంలోనేవున్నాం. యేం చేయటానికి మనకు హక్కులేదు. అలాంటప్పుడు ఇండియా భవిష్యత్తుని, ప్రపంచ భవిష్యత్తుతో ముడి వేయాలంటం మీలో కొంతమందికి అసందిగ్ధంగా కనబడవచ్చు. ముందు మనకు స్వారాజ్యం వస్తే తరువాత ప్రపంచవిషయం చూసుకోవచ్చునని మీరు భావించవచ్చు.

యిలా సందేహం కలగటం సహజమే. కాని యీ యుద్ధం వల్ల, ఇండియా యీ యుద్ధంలో పూర్తిగా పాల్గొని ప్రముఖ పాత్ర వహించకపోయినా, మనదేశంలోకూడా కొన్ని మార్పులు జరక్క తప్పిందికాదు. వీటిని మీరు తేలిగ్గా చూడకూడదు. వాటి విషయం బాగాలోతుకి దిగి ఆలోచించటం మంచిది. ఇండియా భవిష్యత్తుకూడ కొంతవరకు యీ మార్పుల మీద ఆధారపడివుంది, కనుక యుద్ధానంతరం భారతదేశం యెలా వుంటుందో మనం యింకా విపులంగా చర్చించవలసివుంది. అన్నివిషయాలు యిక్కడ చర్చించటంకష్టం. కాని ముఖ్యంగా యీ యుద్ధంవల్ల ఆర్థికంగా, యిండియాలో యేమార్పు జరిగిందో నాకు తెలిసినంతవరకూ చెప్తాను. మీరు ఆ విషయాన్ని తెలుసుకునే ముందు అసలు ముఖ్యంగా భారత దేశంలో సంఘం యెలావుందో, యెలా మారాలో టూకీగా చెప్పటానికి ప్రయత్నించాను.

# యుద్ధానంతర భారత సమస్య

యుద్ధానంతరం భారతదేశం యెలావుంటుందని ప్రశ్నించటం తేలిక. యెలావుంటుందో చెప్పటం తేలికే. కాని ఫలానా విధంగా వుంటుంది అని తేల్చి చెప్పటం కష్టం. మార్క్సిజం జోస్యం చెప్పదు. ఉన్న పరిస్థితుల్ని బట్టి మానవుడు యేవిధంగా ప్రయత్ని స్తే పరిస్థితులు యేవిధంగా మారటానికి వీలుంటుందో చెప్తుతుంది. మనంకూడా యిదే దృక్పథంతో ఆలోచి స్తే యుద్ధానంతరం భారతదేశం యేయే పరిస్థితుల్లో వుంటానికి వీలుందో, ఆ యా పరిస్థితుల్ని బట్టి మనం యేవిధంగా ప్రయత్ని స్తే భావి భారతప్రజలు సుఖపడటానికి వీలుందో తెలుసుకో వచ్చు.

కాబట్టి ఇండియా భవిష్యత్తుని గూర్చి ఆలోచించాలంటే ముందు (1) నేడు యిండియా యే పరిస్థితుల్లో వుందో తెలుసుకో వాలి. (2) ఇండియా, ఇంగ్లండుల మధ్య నేడు యే సంబంధం వుందో, యుద్ధానంతరం అది యెలా పరిణమించటానికి వీలుందో చర్చించాలి. (3) భావి ప్రపంచ పరిస్థితులు ఇండియాకి యే విధంగా తోడ్పడటానికి వీలుందో, ఇండియా తక్కిన ప్రపంచా నికి యెలా తోడ్పడుతుందో తెలుసుకోటం మూడోది. వీటిని మనం కూలంకషంగా చర్చించుకుంటే యుద్ధానంతర భారత దేశం యెలా వుంటానికి వీలుందో చాలావరకు సమాధానం చెప్పుకోవచ్చు. ఇది తేల్చుకుంటే భావి భారతదేశం యెలా వుంటే ప్రజానీకానికి మేలో నిర్ణయించటం తేలిక. కనుక వరుసగా ఒకదాంతరువాత వొకటి చర్చిద్దాం.

# (1) ఇండియా పరిస్థితులు

నేను యిండియా యే పరిస్థితుల్లో వుందో తెలుసుకోవాలంటే నా వుద్దేశం యిచ్చట మళ్ళీ సాంఘికపరిస్థితు లేంటనికాని, రాజకీయ, ఆర్థిక పరిస్థితు లేంటనికాని చెప్పటం కాదు. యీ దృష్టిలో యిండియా నేడు యే స్థితిలో వుందో యిదివరకే స్థూలంగా కొంతవరకు చెప్పాను. నేను చెప్పదలచుకుంది ప్రస్తుతం యుద్ధంవల్ల కలిగిన ఆర్థికమార్పుల్ని గురించి. ఆర్థికపరిస్థితులంటే యిండియాలోని దారిద్ర్యాన్ని గురించి కాదు. ఇదికూడా నేను చెప్పనక్కరలేదు. నూటికి తొంభై మందికి పైగా దరిద్రం అనుభవించటం అందరికీ తెలుసు. కాని వీటన్నిటికంటె ముఖ్యమైంది ఆర్థికపెత్తనం. యీ పెత్తనం యెవరిచేతుల్లో వుంటుందో వాళ్ళదీ రాజ్యం. తక్కినవాళ్ళప్రాణం వారి గుప్పెట్లో వుంటుంది. వీరు తోక జాడిస్తూ వుండవలసిందే.

ఇంతవరకు యిండియా యిదేస్థితిలోవుంది. ఆర్థిక పెత్తనం అంతా యింగ్లండు తనగుప్పెట్లో పెట్టుక్కూచుంది. అసలు యీ పెత్తనం కోసమే ఇంగ్లండు యిండియాని ఆక్రమించుకుంది. తనకు కావలసిన ముడిపదార్థాల్ని చౌకగా తీసుకెళ్ళటం, సరుకులు తయారుచేసి తిరిగి వాటిని యిక్కడకు యెగుమతిచేసి లాభాలు సంపాదించటం యింతవరకు యింగ్లండు చేస్తున్నపని. దీనివల్ల తనకేమీ గిట్టకపోతే ఇండియాని, ఇంగ్లండు తనకింద వుంచుకున్నా వొకటే వొదలి పెట్టినావొకటే. ఇంత పెద్దదేశాన్ని ఆక్రమించుకుని, నానా అవస్థలుపడి రాజ్యాన్ని స్థాపించుకుంది

కేవలం పేరు, ప్రతిష్టలకోసం కాదు. ఆర్థికంగా మన దగ్గరనుంచి మన దేశంలోనుంచి వీలున్నంతవరకు గుంజటానికే. అదిలే న్నాడు మనం వెళ్ళమనక్కర్లేదు. వాళ్ళదోవ వాళ్ళే చూచు కుంటారు. సామ్రాజ్యం వుండదు, పాడూవుండదు.

నేడు ఇంగ్లడు యిదేపరిస్థితి కొచ్చిందని చెప్పాననుకోండి. మీకుచాలా ఆశ్చర్యంవేస్తుంది. అయితే యింకా యెక్కడి వాళ్ళక్కడే ఉన్నారు. వైస్రాయి అలాగేవున్నాడు. గవర్నర్లు వున్నారు. వాళ్ళు వెళ్ళలేదేంటని ప్రశ్నిస్తారు. నిజమే. యింకా రాజ్యంచేస్తూనేవున్నారు. రాజు దివాళా తీసాడనుకోండి. అయినా యింకా రాజసంపోదు. లోపల అంతా ఖాళీఅయినా పైకిమట్టుకి, రాచరికం జరుగుతూనే వుంటుంది, రాజు రాజు గానే కనపడ్డానికి ప్రయత్నిస్తాడు. దర్బారు జరుగుతూనే వుంటుంది. మంత్రులు రాచకార్యాలు దిద్దుతూనేఉంటారు. వెనకటి సంస్కారం ఒకనాటితో పొయ్యేదికాదు: అది నెమ్మది మీద జరగవలసిన పని. యిలాగే నేడు ఇంగ్లండు యిక్కడ రాజ్యం చేస్తుందని చెప్పితే మీ రేమంటారు? 'అయితే ఆలో చించాల్సిందే' నంటారు.

అసలు కారణం. యీ యుద్ధంవల్ల ఇంగ్లండు యీస్థితి కొచ్చింది. యుద్ధంవల్ల యింగ్లండు యిక్కడి వ్యాపారాన్ని సాగించుకోలేక పోయింది. తనకొచ్చే ఆదాయం అంతా యుద్ధ ఖర్చులకూడా చాలటంలేదు. సరుకులకోసం ఇతరదేశాల మీద ఆధారపడినట్లుగా యిండియామీదకూడ ఆధారపడవలసి

వచ్చింది. దీంతో యిండియాలో పెట్టుబడిపెట్టింది అయిపో టమేకాకుండా యింకా బాకీపడింది. యీ యుద్ధం రాకముందు ఇండియా, ఇంగ్లండు కివ్వవలసినబాకీ కొన్ని వందలకోట్లు ఉండేది. యిప్పుడు ఇండియా ప్రభుత్వం ఆ ఋణాన్ని తీర్చుకుంది. పైగా ఇంగ్లండు ప్రభుత్వమే యిండియా ప్రభుత్వానికి కొన్ని వందల కోట్లు ఇప్పుడు బాకీపడింది. యుద్ధం ప్రారంభం అయ్యేటప్ప టికి ఇండియా, ఇంగ్లండు కివ్వవలసిన బాకీ దాదాపు 1200కోట్ల రూపాయలు, 1943 ఫిబ్రవరినాటికి యీ ఋణం అంతా తీరిపో యింది. పైగా యింగ్లండే యిండియాకి 460 కోట్లు బాకీతేలింది. 1943 నవంబరు నాటికి 750 కోట్లకుపైగా పెరిగింది.

ఇంకోవిషయం ఇంతవరకూ యిక్కడ పరిశ్రమలన్నీ చాలా వరకు 'తాతాఐరన్ కంపెనీ, కొన్ని టెక్స్టైల్ పరిశ్రమలు మినహా యించి' తక్కినవన్నీ ఇంగ్లండు వర్తకసంఘం చేతుల్లో ఉండేవి వారే యిక్కడ పెట్టుబడిపెట్టి లాభాలు తీస్తున్నారు. కాని యుద్ధంవల్ల వ్యవహారం బెడిసింది. ఇంగ్లండులో యుద్ధావసరాల కోసం పెట్టుబడి ధనం యెక్కువ కావలసి వచ్చింది. దీనివల్ల యిక్కడ వారికున్న పెట్టుబడిధనం యింగ్లండుకి మార్చవలసి వచ్చింది. ఆ వాటాలుయిచ్చట వర్తకులు కొనుక్కోటానికి వీలు చిక్కింది. ఇప్పటికి రైల్వే, ఇరిగేషన్ డిపార్టుమెంటులు చాలా వరకు దేశీయ వర్తకసంఘంచేతుల్లోకి వచ్చినై. కొత్తగా పెట్టే పరిశ్రమల్లో దేశీయవర్తకులే పూర్తిగా పెట్టుబడి పెట్టుతున్నారు. గత 5, 6 నెల్లక్రిందటి లెక్కలప్రకారం యిచ్చట ఇంగ్లండు

వర్తకుల పెట్టుబడిధనం 20 కోట్ల పౌన్లకంటె యెక్కువలేదు. 40 కోట్ల జనాభావుండి, పెద్ద విస్తీర్ణంగల భారతదేశంలో యీ పెట్టుబడి చాలా తక్కువ. యింతకంటె యెక్కువ మూల ధనాన్ని ఇంగ్లండువర్తకులు స్వతంత్రదేశాలైన బ్రెజిల్, అర్జెంటై నాల్లో పెట్టగలిగారు. కాబట్టి యీ పరిస్థితులన్నీ చూస్తే ఆర్థిక పెత్తనం యింగ్లండు ప్రభుత్వంనుంచి, ఇంగ్లండు వర్తకసంఘం చేతుల్లోనుంచి జారిందని చెప్పవచ్చు.

ఇక్కడ మీకు వొక చిన్న వుపమానం చెప్తాతా. దూర దేశాన్నుంచి వొక షావుకారు యిక్కడకొచ్చి ఒక ఫరం స్థాపించాడు. మొట్టమొదట అతడొక్కడే పెట్టుబడి అంతా పెట్టాడు. ఇక్కడివాళ్ళని నమ్మలేక తనదేశాన్నుంచే తనకు నమ్మకం వున్నవాళ్ళని తీసుకొచ్చి మేనేజర్లుగా, యేజంట్లుగా నియమించుకున్నాడు. వ్యాపారం ప్రారంభించాడు. వచ్చిన లాభం అంతా తానొక్కడే తీసుకుంటున్నాడు. మేనేజర్లకు, యేజంట్లకు జీతాలిస్తున్నాడు.

ఇలా జరుగుతూ ఉండగా తనదేశంలో యుద్ధం వచ్చింది. తాను యిక్కడపెట్టిన డబ్బుకూడ కావలసివచ్చింది. డబ్బు విధిగా పంపవలసి వచ్చింది. అత డేంచేస్తాడు? ఫరం మూసే స్తాడా? కాదు. దాన్ని జాయింటుస్టాకు కంపనీగా మార్చాడు. షేర్లు కొనుక్కున్నవాళ్ళ కందరికీ వాటా లిచ్చాడు. తాను కొంత వాటా అట్టిపెట్టుకున్నాడు. తనవాటా పోను, మొదట తాను పెట్టుబడిపెట్టిన తక్కిన డబ్బంతా తన దేశానికి పంపాడు.

మేనేజర్లు వాళ్ళే ఉన్నారు. యేజంట్లు వాళ్ళే. యుద్ధానికి యింకా డబ్బు కావలసివచ్చింది. అతడు అట్టిపెట్టుకున్న వాటా కూడా పంపించాలని తాఖీదు వచ్చింది. అదికూడా పంపిస్తే అతనికున్న వాటాని అదివరకున్న వాటాదార్లో, లేక కొత్తవాడో కొనుక్కుంటాడు. లేక పంపించనని యెదురుతిరిగితే అతనివాటా అతనికే ఉంటుంది. కాని అతనికీ, అతనిదేశానికీ తెగతెంపులై పోతై. అతడు పంపించినా, పంపించకపోయినా వొకటే. కంపనీ మట్టుకు మూసివేయనక్కర్లేదు. కంపనీ, కంపనీగానే ఉంటుంది.

ఇది యెందుకు చెప్పుతున్నానో మీకు అర్థం అయ్యే ఉంటుంది. స్వంతఫరం- జాయింటు స్టాకు కంపనీగా మారిందంటే అధికారం కూడా వొక్కడికే వుండదు. వాటాదార్ల కందరికీ వుంటుంది. మేనేజర్లు, యేజంట్లు వెనకటివాళ్ళయినా నష్టం లేదు. ఆ కంపనీలో అతని కెంత హక్కు వుందో, తక్కిన వాళ్ళకూ్కూడా అంత ఉంటుంది. అతడు తన వాటాడబ్బుకూడా తీసికొని తనదేశానికి పంపించమంటే ఆ కంపెనీలో అతని హక్కే ఉండదు.

యుద్ధం అయిపోతుందనుకోండి. తిరిగి తాను డబ్బు తెచ్చు కునే అవకాశం ఉంటే తెస్తాడనుకుందాము. తెచ్చి యేంచేస్తాడు? మళ్ళీ తాను అమ్మిన వాటాలన్నీ కొంటాడా? కొనాలని ప్రయత్నించేస్తే వాటాదార్లు అమ్ముతారా? అమ్మరు. బలంవుంటే లాక్కుంటాడు. లేకపోతే వాళ్ళతోపాటు తానుకూడా వొక వాటాదారుగా ఉంటాడు. అదీకాకపోతే, పోటీ చేయగలిగితే

మళ్ళీ యింకో ఫరం పెట్టటానికి ప్రయత్నిస్తాడు. అంతేకాని ఆ కంపనీలో వున్న మేనేజర్లు, యేజంట్లు నావాళ్ళే కాబట్టి హక్కంతా నాదేనని అతడన్నా, అలాగే యీ మేనేజర్లు, యేజంట్లుకూడా ప్రవర్తించినా లాభంలేదు. జీతం కావాలనుకుంటే వాళ్ళువుండి పనిచేస్తారు. లేకపోతే భాగస్థులు వాళ్ళని తీసివేసి కొత్తవాళ్ళని పెట్టుకుంటారు. అసలు అతడు తిరిగి తనదేశంనుంచి డబ్బుమళ్ళీ తెచ్చుకోటానికి ప్రయత్నిస్తే ఆ ప్రభుత్వం వొప్పుకోక అక్కడే ఉంచాలంటుందనుకోండి. అప్పుడు యీ పేచీలు అసలేఉండవు.

క్లుప్తంలో చెప్పాలంటే యిండియానేడు యిదేపరిస్థితుల్లో ఉంది. యింతేకాదు. యుద్ధంకోసం బ్రిటిషుప్రభుత్వం యిక్కడ నుంచి యింకా కొంతఋణంకూడా తీసుకెళ్ళింది. యుద్ధం అయినాక్కూడా పరిస్థితులు యిలాగేవుంటయ్యా అని మీరు ప్రశ్నిస్తారు. 'యింగ్లండు ప్రభుత్వం ఋణం యెగ్గొట్టుతుంది. మళ్ళీ బలవంతంగా ఇంగ్లండు వర్తకులు యిక్కడి పెట్టుబడి దార్లని నెట్టేసి తామే పెట్టుబడిపెట్టి వెనకటిలాగానే ఆర్థిక పెత్తనం చేస్తుందని లాభాలు గడిస్తుందనే' సందేహం మీకుంటుంది. అది సహజంగా కలిగే అనుమానమే. కాని అవివేరే ప్రశ్నలు. "ఇంగ్లండు ప్రభుత్వం మన ఋణాలు యెగ్గొట్టుతుందా ? యెగ్గొట్టితే యెవరికి నష్టం? ఇంగ్లండువర్తకులు మళ్లీ యిక్కడ పెట్టుబడిపెట్టటానికి ప్రయత్నిస్తారా ? ప్రయత్నిస్తే అక్కడిప్రభుత్వం వొప్పుకుంటుందా ? వొప్పుకుంటే ఇక్కడి వర్తకులు వాళ్ళకి చోటిస్తారా?" అనే విషయాలు ముందు

చర్చిద్దాం. ఇక్కడ నేను చెప్పదలచుకున్న విషయాలు, ప్రస్తుత పరిస్థితుల్లో ఇండియాకే ఇంగ్లండు ఋణపడింది. ఇంగ్లండు వర్తకుల స్థానం దేశీయవర్తకులు ఆక్రమించుకున్నారు. ఇంగ్లండు సామ్రాజ్యతత్వాన్ని, ఇండియా వలసరాజ్యతత్వాన్ని కోల్పోయినై. ఇది తాత్కాలికంగా జరిగిన మార్పేనని మీరన్నా ఫరవాలేదు. తాత్కాలికంగానైనా యీ మార్పు జరిగిందని మీరు వొప్పుకుంటే చాలు. ఇక ముందువిషయం ఆలోచిద్దాం.

## 2 ఇంగ్లండు పరిస్థితులు

ఇప్పటివరకూ నేను మనదేశ పరిస్థితుల్ని, అంటే ఆర్థికంగా యీ యుద్ధంవల్ల మన దేశంలో వచ్చిన మార్పుల్ని గూర్చి చెప్పినా యిందులోనే చాలావరకు ప్రస్తుతం మనదేశానికీ, యింగ్లండుకూ ఉన్న సంబంధాన్ని గూర్చి కూడా చెప్పాను. ఇక ముఖ్యంగా మనం ఆలోచించవలసింది యుద్ధానంతరం కూడా యీ రెండు దేశాలమధ్య యిదే సంబంధం వుంటుందా లేక తిరిగి ఇంగ్లండు సామ్రాజ్య దేశంగానూ, ఇండియా వలసరాజ్యంగానూ మారిపోతవా అనే విషయం. యుద్ధానంతర సంబంధాన్ని తెలుసుకోవాలంటే ముందు మనం ఇండియాతోబాటు ఇంగ్లండు ప్రస్తుత పరిస్థితులుకూడా సమగ్రంగా తెలుసుకోటం ముఖ్యం. అప్పుడే మనం యుద్ధానంతర సమస్యనిగూర్చి చర్చించటానికి వీలుంటుంది.

ఈ యుద్ధ ఫలితంగా మన దేశంలో జరిగినట్లే ఇంగ్లండులో కూడా కొన్నిమార్పులు జరిగినై. నేను యింగ్లండులో విప్లవం జరుగుతుందంటే మీరు వొట్టిదే ననొచ్చు. నేను అక్కడ ప్రజాస్వామిక శక్తులు అభివృద్ధి చెందుతున్నై అంటే మీరు ప్రజాస్వామ్యంలేదూ- పాడూ లేదని యెగతాళి చేయవచ్చు. నేనిక్కడ ఆ మాటలు ఉపయోగించి డొంకతిరుగుడువ్యవహారం చేస్తే లాభంలేదు. నేను ఔనంటూ, మీరు కాదంటూ వుంటే మనం యేమీ తేల్చుకోలేము. కాబట్టి ప్రత్యక్షంగా కనపడే మార్పులమీదే మనం ఆధారపడి ఇంగ్లండులోని నిజపరిస్థితులు తెలుసుకుందాము.

ఇష్టంవున్నా లేకపోయినా యీ యుద్ధంవల్ల యింగ్లండులో ప్రభుత్వం కొన్ని మార్పులు చేయక తప్పిందికాదు. ఇంగ్లండు సామ్రాజ్య దేశం. పెట్టుబడి విధానం, స్వేచ్ఛా వ్యాపారం, తయారుచేసిన వస్తువుల్ని లాభాని కమ్ముకోటం దాని ఆదర్శం. కాని యీ యుద్ధంవల్ల యిలా చేయటానికి వీల్లేకపోయింది— స్వేచ్ఛావ్యాపారం అరికట్టబడింది. వ్యక్తులు పెట్టుబడి పెట్టి లాభాలు గడించటానికి వీల్లేకుండా చేయబడింది. పరిశ్రమలన్నీ చాలావరకు ప్రభుత్వం అధీనం చేసుకుంది. వ్యక్తుల అధీనంలో వున్న పరిశ్రమలమీద ఆదాయపన్ను, అధికలాభాల పన్నులు నూటికి తొంభై పైగా వేసి స్వేచ్ఛావ్యాపారాన్ని అరికట్టింది. రేషనింగు ప్రవేశపెట్టి, షావుకార్లూ, బీదవాళ్లూ అనే తేడా లేకుండా అందరికీ సమానంగా ఆహారపదార్థాలు, యితరమైన అవసర వస్తువులు దొరికేటట్లు చేసింది. ప్రజానీకం కొనుక్కునే

టట్లుగా అవసరమైన వస్తువులన్నింటి ధరలు యుద్ధంవల్ల పెరక్కుండా కంట్రోలు చేసింది. స్థూలంగా ఆలోచిస్తే నేడు యుద్ధంవల్ల యింగ్లండులో యీ మార్పులు జరిగినట్లు కనబడుతుంది.

వీటిని మనం తేలిగ్గాచూట్టం పొరపాటు. యీ మార్పుల వల్ల వచ్చిన ఫలితాన్నికూడా మనం ఆలోచించాలి. పెట్టుబడి విధానం, స్వేచ్ఛావ్యాపారం, లాభాలకోసం ఉత్పత్తిచేయటం— వీటిమీాద సామ్రాజ్యప్రభుత్వం ఆధారపడి ఉంది. ఇవిలేన్నాడు సామ్రాజ్యప్రభుత్వం వుండదూ, గ్రామాజ్యప్రభుత్వం వుండదూ. కాని నేడు యింగ్లండులో ఇవి అరికట్టబడ్డవి. అంటే సామ్రాజ్యప్రభుత్వ పునాదులే కదిలిపోయినై అన్నమాట.

ఇంగ్లండు నేడు యీ పరిస్థితుల్లో వుందంటే యుద్ధంముగిసే వరకూ యిలావున్నా తిరిగి యుద్ధం పూర్తికాగానే ఇంగ్లండు యధాప్రకారం అవుతుందని ఆ విషయం ముందు ఆలోచిద్దాం. మీరు వాదించవచ్చు.

ఇంగ్లండుతో మనదేశం యీ మధ్యలో తెగతెంపులు చేసుకొని విడిపోతే తప్ప యుద్ధానంతర ఇంగ్లండు పరిస్థితుల్ని బట్టి ఇండియా పరిస్థితులు చాలవరకు ఆధారపడి వుంటయ్యని చెప్పవచ్చు. కనుక ఆదృక్పధంలోకూడా మనం పరిస్థితులు ఆలోచించటం మంచిది.

# ఇంగ్లండు—యుద్ధానంతరం

యుద్ధానంతరం ఇంగ్లండు యేపరిస్థితుల్లో వుంటుందని ప్రశ్నించమంటే సహజంగా సమాధానాలు (1) తిరిగి సామ్రాజ్య ప్రభుత్వం స్థాపించడానికి ప్రయత్నం జరుగుతుంది. (2) ప్రజా ప్రభుత్వం యేర్పడటానికి వీలుంది. (3) పెట్టుబడిదారులు తమ ప్రభుత్వం స్థాపించుకోలేనప్పుడు ప్రజాస్వామికాన్ని నాశనంచేసి ఫాసిస్టు ప్రభుత్వం స్థాపించటానికి ప్రయత్నిస్తారు.

వీటిల్లో మూడోదాన్ని తేలిగ్గా కాదనొచ్చు. ఫాసిజాన్ని నాశనం చేయటానికే ఈ యుద్ధం జరుగుతుంది. ఫాసిస్టురాజ్యాలు పతనం తప్పదనే దృఢనమ్మకం కలిగింది. అంతర్జాతీయంగా ఫాసిస్టు మిలిటరీశక్తి నశించటం జరిగితీరుతుంది. ఫాసిస్టుతత్వం పూర్తిగా ప్రపంచంలో లేకుండా పోవాలంటే యింకా కొంత కాలం పట్టవచ్చు. కాని ఫాసిజానికి ఆయువపట్టయిన మిలిటరీ శక్తి నశించటంతో ప్రపంచప్రజా స్వామిక శక్తులు అభివృద్ధి చెందటానికి వీలుంది.

స్థూలంగా అంతర్జాతీయ పరిస్థితులిలావుంటే యుద్ధానంతరం ఇంగ్లండు యెలావుంటుందో ఆలోచిద్దాం. ఇంతవరకూ వ్యక్తి గత అభిప్రాయాలెలా వున్నా ఇంగ్లండు దేశం అంతా, షావు కార్లూ, బీదవాళ్లూ—పెట్టుబడిదార్లూ, శ్రామికులూ అంతా కలిసి ఫాసిజాన్ని వోడించటానికి యుద్ధం చేస్తున్నారు. కనీసం ఫాసిస్టురాజ్యాలు వోడిపోయే అంతవరకైనా యీ యుద్ధాన్ని సాగిస్తారు. ఫాసిజాన్ని వోడించాలి—వోడించాలి అని యేక కంఠంతో అంటున్న యింగ్లండులోనే తిరిగి పెట్టుబడిదారులు

ఫాసిజాన్ని స్థాపించటానికి పూనుకుంటే వారు యెంతవరకు జయిస్తారు ? ప్రపంచ ప్రజాస్వామిక శక్తుల్ని, ఇంగ్లండులోని ప్రజాస్వామికశక్తుల్ని యెదిరించి యేకాకిగా యింగ్లండులోని పెట్టుబడిదారులు వకపక్క ఫాసిస్టుప్రభుత్వాల్ని నాశనం చేయ టానికి పూనుకుని మళ్లీ తమ దేశంలో ఫాసిస్టుప్రభుత్వం స్థాపించుకోగలుగుతా రనుకోటం పొరపాటు. ఇది నెరవేరేపని కాదు.

ఒకవేళ ప్రయత్నిస్తారనుకున్నా అసలు ఫాసిస్టుప్రభుత్వాన్ని యెప్పుడుబడితే అప్పుడు, అనుకున్నప్పుడల్లా స్థాపించటం కుదరదు. మనం యిప్పుడు మనదేశంలో సోషలిజం స్థాపించాలనుకుంటే స్థాపిస్తామా? ఫాసిజంకూడా అంతే. పెట్టుబడిదారులు యెప్పుడు పడితే అప్పుడు ఫాసిస్టుప్రభుత్వాన్ని స్థాపించలేరు.

ఒక్కొక్క విషమదశలో, ఆర్థికమాంద్యం యేర్పడ్డప్పుడు ప్రజల్లో అసంతృప్తి బయలుదేరుతుంది. కాపిటలిజం నాశనం అయ్యే పరిస్థితులు వస్తవి. అట్టి స్థితిలో పెట్టుబడిదారులు తమ పెట్టుబడివిధానం రక్షించుకోటానికి ప్రజల్ని మోసవుచ్చి ఐక్యత అనే నినాదంతో ఫాసిస్టుప్రభుత్వం స్థాపించుకుంటారు. నిరుద్యోగ సమస్య పరిష్కరిస్తున్నామనే నెపంతో యుద్ధపరికరాల కోసం ఫ్యాక్టరీలు నిర్మించి, మిలిటరీశక్తిని పెంచి వాటి ద్వారానే తిరిగి విప్లవశక్తుల్ని నాశనంచేస్తారు. గత యుద్ధానంతరం యేర్పడ్డ ఫాసిస్టు ప్రభుత్వాలన్నీ యిలాగే వచ్చినై. మరి యింగ్లండులో యీ యుద్ధానంతరం అలాంటి ఆర్థికమాంద్యం, విషమపరిస్థితులు వచ్చే అవకాశం ఉందా అంటే కనపడదు.

గత యుద్ధానుభవంవల్ల ప్రపంచంఅంతా యిప్పటినుంచే యీ యుద్ధానంతరం తిరిగి అలాంటి పరిస్థితులు రాకుండా జాగ్రత్త పడుతుంది. ఇంగ్లండుకూడా యీ విషయంలో చాలా జాగ్రత్తగా వుంది. పెట్టుబడిదారులు కూడా యీ విషయంలో జాగ్రత్త వహించారు. పెట్టుబడిదారీవిధానం నిలుపుకోవాలన్నా, స్వేచ్ఛావ్యాపారంచేసి లాభాలకోసం వస్తువుల్ని తయారుచేయాలన్నా యీ ఆర్థికమాంద్యం తప్పదు. యిది లేకుండా చేయాలంటే అవి ఉంటానికి వీల్లేదు. అవి లేకపోతే ఫాసిజంయేంటి, కాపిటలిజం కూడా ఉండదు. నేను యింగ్లండుప్రభుత్వం యిదే పంథాలో నడుస్తుంది. కాబట్టి యింగ్లండులో ఫాసిజం వస్తుందని భయపడనక్కర్లేదు.

## సామ్రాజ్యప్రభుత్వం

ఇక రెండోసందేహాం. ఫాసిస్టుప్రభుత్వం. స్థాపించుకోటానికి వీల్లేకపోతే లేకపోవచ్చు,కాని సామ్రాజ్యప్రభుత్వాన్నైనా నిలబెట్టుకోటానికి యింగ్లండులోని పెట్టుబడిదారీవర్గం ప్రయత్నించదా అని మీరడగవచ్చు. ప్రయత్నిస్తే ప్రయత్నించవచ్చు కాని ఆ ప్రయత్నం నెగ్గుతుందా అనేది మనం ఆలోచించాలి.

ఈ యుద్ధంవల్ల ఇంగ్లండులోని పరిశ్రమలన్నీ ప్రభుత్వం ఆధీనం చేసుకుందని స్వేచ్ఛావ్యాపారం, లాభాలు గడించటం అరికట్టబడ్డవని చెప్పాను. క్రిందటి యుద్ధంలోకూడా ఇంగ్లండు ప్రభుత్వం యిలాగేచేసింది కాని యుద్ధంకాగానే తిరిగి ఎవరి

యంత్రాగారాలు వారి స్వాధీనంచేసి స్వేచ్ఛావ్యాపారం చేసుకో నిచ్చింది. ఇప్పుడుకూడా ప్రభుత్వం యీ యుద్ధం పూర్తికా గానే యెవరివి వాళ్ళ అధీనంచేసి వ్యాపారం చేసికోనిస్తే మళ్ళీ యింగ్లండు సామ్రాజ్య దేశం కాటానికి వీల్లేదా అనేది ఒకప్రశ్న.

ఇంకొకటి. యీ యుద్ధంవల్ల ఇంగ్లండులో పెట్టుబడిధనం లోపించింది. క్రిందటి యుద్ధఫలితంగా చాలావరకు ఇంగ్లండులో మూలధనం తగ్గింది. యీ యుద్ధంవల్ల అదికూడా పోయింది. కనుక యిండియాలోకాని, మరేదేశంలోకాని యింగ్లండు పెట్టు బడి పెట్టి లాభాలు గడించే స్థితిలోలేదు. కాబట్టి ఇంగ్లండు సామ్రాజ్య దేశం కావాలంటే అమెరికాదగ్గరనుంచి అప్పుతెచ్చు కుని అది యిండియాలోపెట్టి వ్యాపారం చేయకూడదా అనేది రెండోప్రశ్న.

అమెరికా, ఇంగ్లడుకి అప్పుపెట్టి మనదేశంలో వ్యాపారం చేసుకోనిచ్చే దానికంటే తానే స్వయంగా యిక్కడ వ్యాపారం చేసుకోటానికి ప్రయత్నిస్తుంది. ఇండియానితన పలుకుబడిక్రింద అట్టిపెట్టుకోటానికీ, తద్వారా ఇండియాలో మార్కెట్టు సంపా దించటానికి అమెరికా ఇదివరకటినుంచే గట్టిప్రయత్నంచేస్తుంది. ఒకవేళ ఇంగ్లండుకి అప్పుపెట్టినా ఇండియాలో తనక్కాడ కొన్ని హక్కులిచ్చినప్పుడే యీ అప్పుపెట్టుతుంది. దానివల్ల ఇంగ్లం డుకి ప్రత్యేకంగా వూడిపడేదిలేదు. క్రిందటి యుద్ధంలో ఇంగ్లం డులో పెట్టుబడిధనం తగ్గటంచేత చాల వరకు జపాను ఇండియా మార్కెట్టు పట్టుకుంది. జర్మనీ, బెల్జియం ఆస్ట్రియా మొదలైన

దేశాలనుంచికూడ చౌకధరలకి వస్తువులు రాసాగినై. వాటితో ఇంగ్లండు పోటీచేయలేకపోయింది. యీసారి అమెరికాతో పోటీచేయవలసి వస్తుంది. కాబట్టి అమెరికా దేశంనుంచి అప్పు తీసుకుని మన దేశంలో వ్యాపారం చేయటానికి ప్రయత్నించినా అమెరికాతో పోటీచేయటం కష్టం.

సరే మొదటి ప్రశ్న ఆలోచిద్దాం. ఇంగ్లండుప్రభుత్వం తిరిగి యెవరి యంత్రాగారాల్ని వారి స్వాధీనం చేస్తుందనుకుందాం. స్వేచ్ఛావ్యాపారం చేయనిస్తుంది. అయితే మార్కెట్టులేవీ? ప్రపంచానిక్కూడా కొంత లిమిట్ వుంది. చీటికీ, మాటికీ కొత్త ప్రపంచం కనబడుతుంటే అక్కడ ప్రవేశించి వ్యాపారం చేసుకోవచ్చు. కాని అలాలేదు. ఉన్న మార్కెట్టులైనా జాగ్రత్తచేసుకుందామూ అంటే ఆధునిక పరిస్థితుల్లో అది కుదరదు. సామ్రాజ్యదేశంనుంచి వస్తువుల్ని యెగుమతిచేసి వలసరాజ్యాల్లో అమ్ముకొని లాభాలుగడించటం ఆధునిక సామ్రాజ్య ప్రభుత్వ లక్షణం కాదు. యితరసామ్రాజ్యదేశాల్తో పోటీచేస్తూ— వలస రాజ్యాల్లో పరిశ్రమలు అభివృద్ధిచేయకుండా తనదేశంనుంచే వస్తువుల్ని యెగుమతిచేస్తూఉంటే లాభంలేదని ఆధునికసామ్రాజ్యప్రభుత్వాలు గ్రహించినై. వలసరాజ్యాల్లోనిప్రజలు తాము పంపిన వస్తువుల్ని కొనుక్కునే స్థితిలో లేకపోతే వ్యాపారం జరగదు. రోమన్‌సామ్రాజ్యం యిలాగే నాశనంఅయింది. కనుక వ్యాపారం జరగాలన్నా, లాభాలు గడించాలన్నా వలసరాజ్యాల్లోని ప్రజల కొనుగోలుశక్తి పెరగాలి. ఇది జరగాలంటే వలస

రాజ్యాల్లో పరిశ్రమలు స్థాపించాలి. క్రిందటి యుద్ధానంతరం యింగ్లండు యిదే పని చేయకతప్పింది కాదు. ఇంగ్లండు పెట్టుబడితో యిక్కడ పరిశ్రమలు స్థాపించి తద్వారా లాభాలు సంపాదించటం ప్రారంభించింది.

ఈ యుద్ధానంతరం కూడా అలాగే చేయకూడదా అంటే చేయటానికి వీల్లేదు. కారణం అదనపు పెట్టుబడి ధనం ఉండదు. అసలు పెట్టుబడిధనమే లేకపోతే పరిశ్రమలు స్థాపించే దెట్లా ? అమెరికానుంచి అప్పుతెచ్చుకొని వ్యాపారం సాగిస్తే యేమవుతుందో చెప్పాను. ఇంగ్లండుకి వలసరాజ్యంగాఉన్న యిండియా నెమ్మదిగా అమెరికా వలసరాజ్యం అవుతుంది. కాబట్టి యింకో విధంగా వ్యాపారంద్వారా లాభం సంపాదించాలంటే ఇంగ్లండులోనే శ్రామికవర్గానికి తక్కువ కూలీ యిచ్చి ఆ విధంగా యిక్కడ యితరదేశాల్తో పోటీచేసే పరిస్థితుల్లో ఉండి లాభం సంపాదించాలి. కాని ఆ విధంగా వ్యాపారంచేయటం కష్టం. ఇంగ్లండులోని శ్రామికులు తమకు తక్కువ కూలీ యిచ్చినా పెట్టుబడిదారులకు దాసోహం అని పనిచేసేస్థితిలో లేరు. కాబట్టి వెనకటిలాగా యిప్పుడుకూడా సామ్రాజ్యప్రభుత్వాన్ని నిలబెట్టుకోటం కష్టం. పైగా యీ యుద్ధంవల్ల ప్రతి దేశంలోనూ పరిశ్రమలు విపరీతంగా వృద్ధిచెందినై. ఒకదేశం మరొకదేశానికి మార్కెట్టుగా ఉపయోగించే స్థితిలో లేవు. కాబట్టి భావి ప్రపంచంలో ప్రతిదేశం కూడా విదేశ మార్కెట్లకంటె స్వంత దేశంలోని మార్కెట్లమీదనే ఆధారపడే స్థితి వచ్చింది. అంటే సామ్రాజ్యప్రభుత్వాల శకం అంతరించింది.

ఈ పై రెండు విషయాలు మామూలుగా అనుమానం కలిగే వాళ్ళకోసం చెప్పాను. ఇంతకంటె మరోవిషయంకూడ మీరు గమనించాలి. అసలు ఇంగ్లండులోని పెట్టుబడిదారీ వర్గమే యీ విషయాన్ని గ్రహించింది. సామ్రాజ్యప్రభుత్వం— సామ్రాజ్యప్రభుత్వం అని అంటిపెట్టుకొన్చుంటే లాభంలేదని తెలుసుకుంది. ప్రపంచ పరిస్థితుల్ని బట్టి తాముకూడ మారటం అవసరం అని పెట్టుబడిదారులు యిప్పటినుంచీ జాగ్రత్తపడు తున్నారు.

లండను వాణిజ్యసంఘం యుద్ధానంతర ఇంగ్లండుసమస్యల్ని పరిష్కరించటానికి వొక స్పెషల్ కమిటీని వేసింది. ఆ కమిటీ యుద్ధానంతర పరిస్థితుల్ని గూర్చి వొక రిపోర్టు తయారుచేసి 1942 మే-నెల్లో వాణిజ్యసంఘంముందు పెట్టింది. అందులోని కొన్ని విషయాలు మీకు మచ్చుకి చూపిస్తున్నాను.

"మన ఆర్థికవిధానంలో (పెట్టుబడిదారీ ఆర్థికవిధానం) చెప్ప టానికి వీల్లేనంత అవకతవలున్నవి. అందుకనే మనపరిస్థితులన్నీ తలక్రిందులౌతున్నవి. కాని యీవిషయాన్ని మనం గుర్తించినా వున్న తప్పుల్ని సవరించటాని యింతవరకు మనం పూనుకోలేదు."

ఇలా బాహాటంగా పెట్టుబడిదార్లు తమతప్పుతామే వొప్పు కోటం శుభసూచకం. యుద్ధంమూలకంగా ఉత్పత్తినంతా ప్రభుత్వం తన కంట్రోల్లో పెట్టుకొని అందరికీ సమానంగా పంచి పెట్టటంవల్ల కలుగుతున్న ఫలితాన్ని వ్యాపారస్థులుకూడ గ్రహించారు. తమ ఆర్థికవిధానంకంటే యిదేమంచిదని వారిప్పు

డిప్పుడు తెలుసుకుంటున్నారు. భావిప్రపంచ పరిస్థితుల్ని అర్థం చేసుకోగలిగిన వ్యాపారస్థులు యుద్ధం తరువాతకూడా ఆర్థిక విధానం యుద్ధసమయంలో వున్నట్లే వుండాలని కోరుకుంటున్నారు.

'పెట్టుబడిదారీ ఆర్థికవిధానంలో వున్న అవకతవకలేంటి' వుత్పత్తి తిరిగి వినియోగంకోసం జరగటంలేదు. వ్యాపారం చేయటానికి యితర్లను దోపిడిచేసి లాభం సంపాదించటానికి వుత్పత్తి జరుగుతుంది. ఇలా జరగటంవల్ల నిజంగా ప్రజానీకానికి కావలసినంత వుత్పత్తి జరక్కపోయినా ప్రజలకు కొనుగోలుశక్తి లేకపోటం చేత వుత్పత్తిఅంతా నిలవవుంచి, యెక్కువ వుత్పత్తి అయిందనుకోటం, దానివల్ల ఆర్థికమాంద్యం యేర్పడటం, యిలాంటి అవకతవకలన్ని జరుగుతున్నై. ఈ రెండు యుద్ధాలమధ్య ఆర్థిక విధానంఅంతా యిలాగే యెగుడుదిగుడులతో నిండివుంది. ఇలాంటి అవకతవకలు మళ్ళీచేయకూడదు. అని యీ కమిటీ వార్నింగు యిచ్చింది.

పెట్టుబడిదారీ ఆర్థికవిధానంలోవున్న లోటు చూపిస్తూ ఈ రిపోర్టు యింకా చెప్పినమాటలు "కేవలం యితర దేశాలతో పోటీచేయటానికి, వీటికంటె చౌగ్గా అమ్మటానికి వుత్పత్తిజరిగింది. కాని ప్రజా వినియోగంకోసంకాదు." కాబట్టి "ప్రజానీకానికి సుఖంచేకూర్చాలంటే పారిశ్రామికంగానూ వ్యావసాయికంగాను జరిగేవుత్పత్తినంతా అవసరాలు గుర్తించి వొక సక్రమమైన పంథాలో నడపటం ముఖ్యం" అనికూడా యీ కమిటీ హెచ్చరించింది.

ఈ కమిటీ యిచ్చిన రిపోర్టులో "20 వ శతాబ్దంలోని ఆర్థికవిధానం"అని వొక ప్రత్యేకభాగంకూడా చేర్పబడింది. ఇందులో "భావిప్రపంచంలో అందరికీ సమానంగా అన్ని వస్తువులు లభించేటట్లు ప్రయత్నించటం ముఖ్యం. పెట్టుబడిదారీ ఆర్థికవిధానంవల్ల యీపని జరగదు. కాని యిదేకావాలంటే ప్రయోజనంలేదు. ముఖ్యంగా శ్రామికవర్గం యీ విధానాన్ని యిక సహించలేదు. సహించదుకూడాను."

యీ కమిటీ యిచ్చిన రిపోర్టులో "యుద్ధానంతర పారిశ్రామిక విధానం" అనే మరో అంశంకూడ ఉంది. ఇందులో మరీ స్పష్టంగా యీ కమిటీ తన వుద్దేశాన్ని వెల్లడించింది. "ప్రతి పరిశ్రమలోకూడా ఉత్పత్తి యిష్టంవచ్చినట్లు జరక్కూడదు. యుద్ధానంతరం పరిశ్రమలన్నీ వొకదానితో వొకటి సంబంధం పెట్టుకుని పోటీపడకుండా యేయే వస్తువు లెంతవరకు ఉత్పత్తి చేయాలో వొక కార్యక్రమం నిర్ణయించుకోవాలి. ఇలా పరిశ్రమల నన్నింటిని వొక సక్రమపంథాలో పెట్టటానికి పారిశ్రామిక యజమానులు, వాణిజ్యసంఘం, శ్రామికవర్గం ప్రాతినిధ్యం వహించి ట్రేడ్‌బోర్డుచేత అప్రూవ్‌పొందిన వొకసంఘం అవసరం. ఇది పారిశ్రామిక సంఘం అని పిలువబడుతుంది. పరిశ్రమలన్నీ దీని అధికారానికి లోబడి వుండాలి. ప్రభుత్వ పరిశ్రమల్నీ, వ్యక్తిపరిశ్రమల్నీ తనిఖీచేస్తూ సంఘం మొత్తానికంతటికీ లాభం కలిగేటట్లుగా యీసంఘం ఉత్పత్తిచేయిస్తుంది."

ఇదంతా ఆచరణలోకొస్తే సామ్రాజ్యతత్వం వుండదూ, పాడూ ఉండదు. కాని యుద్ధానంతరం యిది యెంతవరకు

ఆచరణలోకొస్తుందో చెప్పలేము. కాని యిప్పటి పరిస్థితినిబట్టి చూస్తే ఇంగ్లండు వాణిజ్యసంఘం కూడా తమ ఆర్థికవిధానం లోని లోటు గ్రహించి గత యుద్ధానంతరంలాగానే మళ్ళీ తప్పుచేయటం భావ్యం కాదనే అభిప్రాయంలో ఉంది. యేది యెలావున్నా యీ యుద్ధఫలితంగా వారు నేర్చుకుంది పరిశ్రమ లన్నీ వొక సక్రమపంథాలో నడపవచ్చునని, అలా నడిపితే ఉత్పత్తి పంపకంలో యెగుడుదిగుడులు రావని, ఆర్థికమాంద్యం యేర్పడదని, సంఘం అంతా సుఖపడుతుందని.

## ఇండియా కార్యదర్శి అమెరీ

యిదే విధంగా మిస్టరు అమెరీ కూడా యుద్ధానంతరం ఇంగ్లండు యిండియాతో పెట్టుకోవలసిన సంబంధాన్ని గూర్చి మాట్లాడుతూ బ్రిటిషువాణిజ్యసంఘానికి వార్నింగుయిచ్చాడు. అమెరీ పక్కా సామ్రాజ్యవాది. సామ్రాజ్యం నాశనం కావటం అతనికి సుతరామూ యిష్టంలేదు. కాని పరిస్థితుల్నిబట్టిచూస్తే సామ్రాజ్యప్రభుత్వం వుండేటట్లు కనబడలేదు. కాబట్టి యింగ్లండు స్వరక్షణకోసమైనా యుద్ధానంతరం కూడా యిండియాతో వెనుకటి సంబంధాలే కావాలనుకోటం ప్రమాదం అని గ్రహించి పరిస్థితుల కనుకూలంగా కొత్తసంబంధం పెట్టుకోవాల్నంటున్నాడు. అమెరీ చెప్పిన మాటల్లో కొన్ని యిక్కడ వుదహరిస్తున్నా.

“మన యిష్టంవచ్చిన వాటిని వుత్పత్తిచేయటం, తక్కిన వాటిని మనం ఇతరదేశాలనుంచి మనవస్తువులకి మారకంవేసి

తెప్పించుకోటంవల్ల ప్రయోజనం లేదు. ఇలా చేయటంవల్ల (1) మనకున్న ఖనిజపదార్థాల్ని మానవశ్రమని సరిగ్గా వుపయోగించుకోలేము. (2) నిరుద్యోగం ప్రబలుతుంది. (3) చివరకు మన ఆర్థికవిధానమే దెబ్బతింటుంది. కాబట్టి మనకు కేవలం వుత్పత్తిచేయటం ప్రధానంకాదు. మనం వేటిని వుత్పత్తిచేస్తామో వేటిని ఇతరదేశాల్నుంచి తెప్పించుకోవాలో తెలుసుకొని అలా వుత్పత్తిచేయడం ముఖ్యం. వస్తువుల్ని మననుంచి కొనుక్కుంటున్న మనవలసరాజ్యాలు, తక్కినఇతరదేశాలు యీయుద్ధఫలితంగా అంతకుముందునుంచి అవే అనేక వస్తువుల్ని తయారుచేసుకుంటున్నై. కాబట్టి యిక వాటికి మన దగ్గరనుంచి కొనుక్కునే అవసరం లేదు. యిలా మార్పు జరగటంవల్ల ప్రపంచానికిగాని, మన వ్యాపారానిగ్గాని నష్టంలేదు. కాని మనం చేయవలసినపని కొత్త పరిస్థితుల్ని అర్థంచేసుకోవాలి. వాటి ననుసరించి మన ఉత్పత్తి విధానం మార్చుకోవాలి. ఇదివరకు మనదగ్గర వస్తువుల్ని కొనుక్కుంటున్న దేశాలతో "మేము యిదివరకు పంపుతున్న వాటినే ముందుకూడా పంపుతూఉంటాం. మీరు విధిగా కొనుక్కోవాలని" పోట్లాటపెట్టుకుంటే కుదరదు. ఆదేశాల్లో తయారుచేసుకోలేని వస్తువుల్ని మనం ఇకనుంచి తయారుచేస్తూ వాటిని మనకు కావలసిన వస్తువులకోసం మారకంవేయటం అవసరం.

"ఇండియా, ఆచ్చట ఖనిజపదార్థాల్ని, మానవశ్రమని బట్టి చూస్తే బ్రహ్మాండమైన పారిశ్రామికదేశం కావటానికి చాలా అవ

కాశంవుంది. ఇండియాలోని ప్రజానీకంయొక్క జీవితపరిమాణం హెచ్చించాలంటే ఇండియాదేశంలో పారిశ్రామికంగా అభివృద్ధి చేయాలని అచ్చట స్వాతంత్ర్య వాదులంతా గుర్తించారు. ఇండియా పారిశ్రామికంగా అభివృద్ధి చెందిందంటే ఆదేశం యొక్క దిగుమతి వ్యాపారంలో చాలా మార్పులు జరుగుతై. దీనివల్ల మన వెనుకటి వ్యాపారంఅంతా తల్లకిందు లౌతుందని, మనం నష్టపడతామని వాపోతే ప్రయోజనంలేదు. పరిస్థితుల్ని గమనించి వాటిని మనకనుకూలం చేసుకోటం ముఖ్యం. యుద్ధం ముగియగానే మొట్టమొదట ఇండియాకోరే వస్తువులు పరిశ్రమ కోసం కావలసిన యంత్రసామగ్రి, ఫ్యాక్టరీపనిముట్లు మొదలైనవి. కాబట్టి దీని కనుకూలంగా మనం ఇండియాకి కావలసిన వస్తువుల్ని పంపుతూ ఆదేశంతో సహకారం అభివృద్ధి చేసుకోటంలోనే మన అభివృద్ధికూడా యిమిడివుంది. ఇండియాని ముందుకూడా ఇంగ్లండు వలసరాజ్యంగానే అట్టిపెట్టుకుందామనే కాంక్ష త్యజించి ఇండియాని సమానంగాచూస్తూ, సహకారం పెంపొందించుకొని తద్వారా మనంకూడా భావించటం మంచిది. యేది మంచిదో బ్రిటిషువర్తకులు ఆలోచించుకోవాలి. వెనుకటి లాగానే ఇండియాని వలసరాజ్యంగా తొక్కిపట్టి వుంచాలనుకుంటే బ్రిటిషువ్యాపారం నాశనం అవుతుంది. ఇంగ్లండుకి ప్రమాదం వస్తుంది. ఇండియాతో కొత్త సంబంధం పెట్టుకుంటే అటు యిండియాకీ యిటు ఇంగ్లండుకీ లాభదాయకం."

ఇవి పక్కా సామ్రాజ్యవాది అమెరీ చెప్పిన మాటలు. జాతీయవాదుల కివి మోసంగా కనబడవచ్చు. కాని సామ్రాజ్య ప్రభుత్వాన్ని కాపాడుకోవాలన్నా ప్రయోజనంలేదని సామ్రాజ్యవాదులే గ్రహించారు. తమాషా యేమంటే సామ్రాజ్యవాదులే సామ్రాజ్యతత్వానికి ఉద్వాసన చెప్పుకుంటున్నారు. యే సామ్రాజ్యవాదీ తనంతట తాను నష్టానికి వొప్పుకోడు. ఇండియాలో పరిశ్రమలు అభివృద్ధి చెందనీయకుండా దాన్ని వలసరాజ్యంగా అట్టిపెట్టినందువల్ల ప్రయోజనం లేదని సామ్రాజ్యవాదులు గుర్తించారు. ఇండియా పారిశ్రామికంగా అభివృద్ధి చెందుతుంది. కాబట్టి ఇండియాలో పరిశ్రమలు అభివృద్ధిచెందటం ఇంగ్లండుక్కూడా లాభదాయకమే. అమెరీమాటల్నిబట్టి చూస్తే సామ్రాజ్యప్రభుత్వాన్నే పొడుగిస్తే వాళ్ళకే నష్టం. ఉత్పత్తి ప్లానుప్రకారం వొక సక్రమమైన పంథాలో నడవదు. ఆర్థికవిధానం తలక్రిందులౌతూ వుంటుంది.

## లేబరుపార్టీ

ఇక వీటికి వ్యతిరేకంగా వున్న బ్రిటిషు లేబరుపార్టీ అభిప్రాయం కూడా మీరు తెలుసుకోటం మంచిది. యుద్ధానంతరం లేబరుపార్టీ ప్రభుత్వంలో యిప్పటికంటె యెక్కువ ప్రాబల్యాన్ని సంపాదించే అవకాశాలున్నై. క్రిందటి లేబరుపార్టీ వార్షిక సమావేశంలో కొన్ని ముఖ్య తీర్మానాలు జరిగినై. యుద్ధసమయంలో స్వేచ్ఛావ్యాపారం అరికట్టినట్లే యుద్ధానం

తరంకూడా యిదేవిధంగా వుండాలని లేబరుపార్టీ తీర్మానించింది. పార్లమెంటులో లేబరుపార్టీ నాయకుడు, ఉపప్రధాని అయిన మిస్టరు అట్లీ యీ సమావేశంలో మాట్లాడుతూ యుద్ధానంతరంకూడా యుద్ధంకొరకు ప్రవేశపెట్టిన ఆర్థికవిధానమే వుంటానికి లేబరుపార్టీ గట్టిగా ప్రయత్నిస్తుందని చెప్పాడు. కాబట్టి యుద్ధానంతరం ఇంగ్లండు ఆర్థికవిధానం కొంత లేబరుపార్టీనిబట్టి కూడా వుంటుందని చెప్పటంలో సందేహంలేదు.

## బీవరిడ్జి స్కీము

ఇక్కడ మీకు మరొక విషయం కూడా గుర్తుచేయటం మంచిదనుకుంటాను. బీవరిడ్జి యుద్ధానంతరం ఇంగ్లండు అవలంబించవలసిన ఆర్థికవిధానంమీద వొక స్కీము తయారుచేశాడు. దీనిప్రకారం ఇంగ్లండుప్రభుత్వం ఇంగ్లండుదేశంలో ప్రతి సంవత్సరం 500 నుంచి 800 వందల కోట్ల రూపాయలు ప్రజలకోసం ఖర్చుపెట్టవలసి వుంది. తక్కింది యితరదేశాల్లో పెట్టుబడి పెట్టటానికి వీలుందికదాఅంటే, ఇంగ్లండుప్రభుత్వాదాయంకూడా యింతకంటె మించిలేదు.

కాబట్టి బీవరిడ్జి స్కీముప్రకారం ఇంగ్లండుప్రభుత్వం ఆచరిస్తే యుద్ధానంతరం ఇంగ్లండు సామ్రాజ్యదేశంగా వుంటానికి వీల్లేదు. స్థూలంగా బీవరిడ్జిస్కీముని బ్రిటిషుపార్లమెంటు అంగీకరించింది. ఒకవేళ యుద్ధానంతరం బ్రిటిషు కన్సర్వేటివుముఠా బీవరిడ్జి స్కీముని తోసేయకూడదా అంటే దానికి అంత బలం లేదు.

యుద్ధానంతరం బీవరిడ్జి స్కీముమీాద జనరల్ ఎన్నిక జరిగితే ఆ స్కీము కావాలనేవారి సంఖ్య యెక్కువుంటుంది. కాబట్టి ఆ స్కీముని యెదిరిస్తే కన్సర్వేటివ్ ముఠా ప్రభుత్వంనుంచి విరమించుకోక తప్పదు.

## తేలిన విషయాలు

యీా పరిస్థితులన్నీ ఆలోచిస్తే యింగ్లండులో యుద్ధానంతరం ఫాసిస్టుప్రభుత్వంకానీ, సామ్రాజ్యప్రభుత్వంకానీ వుంటానికి వీల్లేదు. ఆర్థికమాంద్యం రాకుండా చేయటానికి బ్రిటిషుప్రముఖులు యిప్పటినుంచే జాగ్రత్తపడుతున్నారు. ఆర్థికమాంద్యం రాకుండాచేయాలంటే పెట్టుబడిదారీ ఆర్థికవిధానాన్నిమార్చాలి. గత 20 సంవత్సరాలనుంచీ పెట్టుబడిదారీ ఆర్థికవిధానంవల్ల వచ్చిన చిక్కులు వారు మరిచిపోలేదు. పాత పద్ధతంటే రోత పుట్టింది. కొత్తదానికోసం వెతుకుతున్నారు. యీా యుద్ధం వల్ల ఆర్థికవిధానాన్ని యెలా మార్చాలో తెలుసుకున్నారు. యుద్ధానంతరంకూడా యిదే పద్ధతి నవలంబించాలనే సూచన చేస్తున్నారు. యిలాచేస్తే ఫాసిస్టుప్రభుత్వంకానీ, సామ్రాజ్య ప్రభుత్వంకానీ వుంటానికి వీల్లేదని మనకంటె వాళ్ళే ముందు గ్రహించారు. కాని యెందుకు వొప్పుకుంటున్నారు ? ప్రపంచాన్ని మోసం చేయటానికా లేక పరిస్థితుల కెదురుతిరిగితే తమ నాశనం తప్పదని తెలుసుకునా ? ఇప్పటి వాలకాన్నిబట్టి చూస్తే రొండోదే వారి మనస్సులోవున్నట్లు తోస్తుంది. రుజువు కావాలంటే ఇంకా కొంతకాలం వేచివుండాల్సిందే.

కాబట్టి ప్రస్తుత పరిస్థితుల్ని బట్టి ఇంగ్లండులో యుద్ధానంతరం ఫాసిస్టుప్రభుత్వానికిగానీ, సామ్రాజ్యప్రభుత్వానికిగానీ ఆస్కారం లేదు. ఇక మిగిలేది మూడో పద్ధతే. ప్రజాప్రభుత్వం స్థాపించటం తప్పనిసరి అవుతుంది. ఇది అటు యింగ్లండుకీ యిటు యిండియాకీ శ్రేయస్కరం. ఇలా కాకుండా మీరు ఇంగ్లండులోని పెట్టుబడిదారులు సామ్రాజ్యప్రభుత్వం మళ్ళీ స్థాపిస్తారనే గట్టి నమ్మకంలోవుంటే నేను చెప్పేదేమీలేదు. అయితే వొక విషయంచెప్పతాను. ఇండియామట్టికి వలసరాజ్యంగా వుండదు. యీ విషయం ఇదివరకే చాలా చెప్పాను. ఇంగ్లండు సామ్రాజ్యదేశంగానే వుండాలనుకుంటే మరో వలసదేశాన్ని సృష్టించుకోవలసి వస్తుంది. మనకీ, ఇంగ్లండుకీ సంబంధం వుండదు. అప్పుడు ఇంగ్లండు యెలావున్నా మనం గాభరా పడక్కర్లేదు.

## 3 అంతర్జాతీయ పరిస్థితులు

అంతర్జాతీయ పరిస్థితులు ఇండియాని యేవిధంగా మార్చటానికి వీలుందో తెలుసుకోటం మూడో విషయం. యీ విషయాన్ని నేనిదివరకే కొంత చర్చించాను. ఇంతకుముందు మాట్లాడిన మిత్రులుకూడ అంతర్జాతీయంగా చాలా మాట్లాడారు. మళ్ళీ అదే క్లుప్తంలో చెప్పి యిది ముగిస్తాను.

అంతర్జాతీయంగా ఫాసిజం, కనీసం ఫాసిస్టు మిలిటరీశక్తి నాశనం అవుతుందనే దృఢనమ్మకం యేర్పడింది. దీంతో అంతర్జాతీయంగా ప్రజాస్వామికం బలపడటానికి కావలసినంత అవకాశం చిక్కుతుంది. ఇది అలావుంచి యుద్ధానంతరం యిప్పుడు

కోల్పోయిన నష్టపరిహారానికి తిరిగి నూతన నిర్మాణం జరగాలి. ఇందుకోసం మానవ శ్రమ, పారిశ్రామిక అభివృద్ధి అవసరం. యుద్ధానంతర ఆర్థిక నిర్మాణంలో భారతదేశం ప్రముఖపాత్ర నిర్వహించవలసి వుంది. మనదేశంలో కావలసినంత మానవ శ్రమ, ఖనిజసంపత్తి వుంది. 40 కోట్ల జనాభా కల భారత దేశాన్ని దూరంగావుంచితే ప్రపంచ నూతన నిర్మాణం, నిర్మాణంకాదు. ఇండియాని పారిశ్రామిక దేశంచేస్తే యిది ఇటు ఇండియాకీ, అటు తక్కిన ప్రపంచానికీ శ్రేయస్కరం. అంతర్జాతీయంగా ప్రజాస్వామికం జయించిందంటే భారతదేశంలో పారిశ్రామికాభివృద్ధి జరగటం అవసరం అవుతుంది. ఇంతకు ముందు యిక ఇండియా వలసరాజ్యంగా వుండదని చెప్పాను. దీనికి యిదొక కారణం కూడాను. ఒకవేళ యింగ్లండు యిక్కడి పరిశ్రమల్ని అరికట్టటానికి ప్రయత్నించినా అంతర్జాతీయ ప్రజాస్వామికం వూరుకోదు. అంతర్జాతీయ పరిస్థితులకు యింగ్లండు లోబడవలసివస్తుంది.

## తేలిన విషయం

కనుక యేవిధంగా చూచినా భారతదేశంలో పరిశ్రమలు అభివృద్ధిచేయటం తప్పనిసరి అవుతుంది. దేశంలో దారిద్ర్యం పోవాలంటే పరిశ్రమలు అభివృద్ధిచేయాలి. ప్రజా జీవిత పరిమాణం హెచ్చించాలి. ఇంగ్లండు యిక్కడ పరిశ్రమలు అభివృద్ధి చెందకుండా అరికట్టితే దానివల్ల ఇంగ్లండుపొందే లాభం శూన్యం. ఇక్కడ ప్రజానీకం దారిద్ర్యంలోవుండి వస్తువుల్ని

కొనుక్కునే స్థితిలో లేనప్పుడు ఇంగ్లండు యిక్కడికి వస్తువుల్ని యెగుమతిచేసినా వొకటే, చెయ్యకపోయినా వొకటే. లాభం వుండదు. ప్రజాజీవిత పరిమాణం హెచ్చించాలంటే యిక్కడ పరిశ్రమలు అభివృద్ధిచెయ్యాలి. కాని యింగ్లండునుంచి యిక్కడకు తెచ్చి పెట్టుబడిపెట్టటానికి మూలధనంలేదు. కాబట్టి యేం చేస్తుంది ? పరిశ్రమలు అభివృద్ధికాకుండా అరికట్టి నలభైకోట్ల భారతీయుల్ని దారిద్ర్యంలో వుంచి తన వ్యాపారాన్ని నాశనం చేసుకుంటుందా లేక భారతీయుల్నే పరిశ్రమలు పెట్టుకోనిచ్చి తనకు కావలసింది యిక్కడనుంచీ, యిక్కడ కావలసిందీ తాను పంపుతూ వ్యాపారాన్ని నిలబెట్టుకుంటుందా ? యేది మంచి పద్ధతి ? ఇంగ్లండు రొండో పద్ధతినే అవలంబిస్తుంది. దీనికి తోడుగా అంతర్జాతీయ పరిస్థితుల్నిబట్టి కూడా యుద్ధానంతరం మన దేశంలో పరిశ్రమలు అభివృద్ధిచెందటం తప్పనిసరి అవుతుంది. కాబట్టి యుద్ధానంతరం భారతదేశం కూడా ప్రముఖపాత్ర నిర్వహించవలసివుంటుం దంటంలో సందేహంలేదు.

## యుద్ధానంతర సమస్య

జాతీయ, అంతర్జాతీయ పరిస్థితుల్ని, ఇంగ్లండు—ఇండియా సంబంధాల్ని గూర్చి చర్చించినమీదట ఇండియాలో పారిశ్రామిక అభివృద్ధి జరగటం తప్పనిసరి అని తెలుసుకున్నాము. యుద్ధానంతర భారతదేశ సమస్య కూడా యిదే. అంతర్జాతీయ పరిస్థితు లలావుంచి భారతదేశప్రజల దారిద్ర్యం పోవటానికైనా యిక్కడ పరిశ్రమలు అభివృద్ధిచెయ్యాలి. పరిశ్రమలు అభివృద్ధి

చెందితే కాని ప్రజాజీవిత పరిమాణం హెచ్చటానికి, దారిద్ర్యం తగ్గటానికి వీలుండదు. కాబట్టి పరిశ్రమలు అభివృద్ధిచెయ్యాలి. యుద్ధానంతరం మనం ముఖ్యంగా పరిష్కరించవలసిం దీసమస్యే.

'ఇది బాగానేవుంది. పరిశ్రమలు అభివృద్ధి కావలసిందే' నని మీా రంటారు. కాని 'అసలు పరిశ్రమలు యెలా అభివృద్ధి చేస్తాం?' అని ప్రశ్నించుకుంటే యిది యీాలా గడ్డుప్రశ్నగానే కనబడుతుంది. మనదేశంలో యింతవరకూ పరిశ్రమలు అభివృద్ధి చెందలేదు. ముందు యిలా అభివృద్ధిచెందుతై అని స్థూలంగా ఆలోచించుకుంటే, పరిశ్రమలు అభివృద్ధిచెందటానికి వీల్లేదనే విషయం తట్టుతుంది. ప్రజల దరిద్రం పోగొట్టాలంటే పరిశ్రమలు అభివృద్ధిచెయ్యాలి. నిజమే కాని పరిశ్రమలు అభివృద్ధి కావాలంటే ప్రజల్లో కొనుగోలు శక్తి వుండాలి. ఒక దానిమీాదట వొకటి ఆధారపడి వుంది. పెళ్లైతేకాని పిచ్చి కుదరదు, పిచ్చి కుదిరితేకాని పెళ్ళికాదు. మనదేశ పరిస్థితులు కూడా యీా మోస్తరుగా వున్నవి. అందుకనే ఇంతవరకూ పరిశ్రమలు అభివృద్ధిచెందటానికి వీల్లేకపోయింది. మరి ముందు కూడా యింతే. అయినా మనం యీా విషమావస్థనుంచి బయటపడే మార్గం కనిపెట్టాలి.

## పరిశ్రమలు యెందుకు అభివృద్ధి కాలేదు ?

మనం యీా అవస్థ తప్పించుకోవాలంటే ముందు మనం కొంతవరకు వెనకటినుంచి పరిశ్రమలు అభివృద్ధి కానందుకు కారణా లేంటో తెలుసుకోటం మంచిది. అవి తెలుసుకున్న

తరువాత వాటిని యెలా తొలగించగల్గుతామో ఆలోచిద్దాం. మనం యిక్కడ ఆర్థిక, రాజకీయ పరిస్థితుల్ని సిద్ధాంతరీత్యా చర్చిస్తున్నాం. కాబట్టి ఒకరిమీద ద్వేషం, ఒకరిమీద ప్రేమ చూపి పరిస్థితుల్ని అర్థంచేసుకోటానికి ప్రయత్నిస్తే యథార్థం తెలుసుకోలేము. కాబట్టి నిష్పక్షపాతబుద్ధితో మనం చరిత్రని పరిశీలించాలి.

పరిశ్రమలు అభివృద్ధిచెందక పోటానికి తరచుగా మనం వింటున్న కారణాలు (1) మనకి స్వాతంత్ర్యంలేదు. (2) బ్రిటిషు సామ్రాజ్యతత్వం పరిశ్రమలు అభివృద్ధికాకుండా అరికట్టుతుంది. మామూలుగా మనం వింటున్న కారణా లివి. కొంతవరకు యీ కారణాలుకూడా నిజమే. వీటివల్ల మనదేశంలో కావలసినంత పారిశ్రామిక అభివృద్ధి జరగలేదు. కాని యివే ముఖ్యకారణాలంటే నేను వొప్పుకోను. యింకో కారణంకూడా వుంది. మీరు ఆవేశంతోనూ, ఉద్రేకంతోనూ ప్రశ్నించితే లాభంలేదు. యథార్థపరిస్థితులు తెలుసుకోటానికి ప్రయత్నించాలి.

నూట యాభై సంవత్సరాలనుంచీ మనం బ్రిటిషుప్రభుత్వం క్రింద దాస్యం అనుభవిస్తున్నాం. ఇక్కడనుంచి ముడిపదార్థాలు తీసుకొనివెళ్ళటం, తిరిగి యింగ్లండులో తయారయిన వస్తువుల్ని మనదేశంలో అమ్ముకొని లాభం సంపాదించటం బ్రిటిషుప్రభుత్వం అప్పటినుంచీ యిప్పటిదాకా చేస్తున్న పని. మనం కొనే స్థితిలో వుండం. ఇంగ్లండు పంపిన వస్తువులు యిక్కడ ఖర్చు కావు. అప్పుడు వ్యాపారం యేం అవుతుంది? బ్రిటిషుప్రభుత్వం

యేంచేస్తుంది ? వ్యాపారం సాగనప్పుడు, లాభాలు రానప్పుడు మనదేశాన్ని ఇంగ్లండు తనక్రింద వుంచుకున్నా వొకటే, లేకపోయినా వొకటే. యీ సమస్యని పరిష్కరించ లేనప్పుడు సామ్రాజ్యపతనం తప్పదు. రోమనుసామ్రాజ్యం యిలాగే పతనం అయింది.

ఆధునిక సామ్రాజ్య ప్రభుత్వాలు తమ సామ్రాజ్యాలు నిలుపుకోటానికి కొత్తమార్గం కనిపెట్టినై. వలసరాజ్యాల్ని కేవలం బానిసత్వంలోనూ, దారిద్ర్యంలోనూ వుంచితే లాభం లేదని గ్రహించినై. వలసరాజ్యాల్లోని ప్రజలకు కొంత కొనుగోలు శక్తి కలిగించాలి; అప్పుడే వ్యాపారం సాగటానికి వీలుం దని తెలుసుకున్నై. కాలువలు త్రవ్వించటం, తంతి సౌకర్యాలు, రైల్వేమార్గాలు నిర్మించటం, రోడ్ల నిర్మాణం మొట్టమొదట అవసరంగా కనపడ్డది. రానురాను వలసరాజ్యాల్లోనే పెట్టుబడి పెట్టి పరిశ్రమలు స్థాపిస్తే తద్వారా వ్యాపారం చేయవచ్చునని, లాభాలు గుంజవచ్చునని తెలుసుకున్నై. కాని ఇది సామ్రాజ్యతత్వంలోవున్న పరస్పరవైరుధ్యభావం. సామ్రాజ్యతత్వం నిలవాలంటే వలసరాజ్యాల్లో పరిశ్రమలుపెట్టటం, ప్రజల కొనుగోలుశక్తి హెచ్చించటం అవసరం అయింది. ఇలా జరగటంచేత వెనుకబడివున్న వలసరాజ్యాల్లోని ప్రజలు విజ్ఞానం పొంది తమ స్వాతంత్ర్యంకోసం తిరిగి సామ్రాజ్యప్రభుత్వాల మీద యెదురుతిరగటానికి అవకాశం లభిస్తుంది. లేకపోతే వలసరాజ్యాలు స్వతంత్రం పొందే అవకాశం తక్కువ.

మన దేశంలో బ్రిటిషుసామ్రాజ్యప్రభుత్వం కూడా యింతే చేసింది. నూట యేభై సంవత్సరాలకూ, యిప్పటికీ మన దేశ పరిస్థితులు ఆలోచిస్తే అప్పటికంటె యిప్పుడు మనం కొంత మెరుగని చెప్పవచ్చు. కాని అప్పటినుంచీ మనం స్వతంత్రంగా వుంటే యింతకంటే యెన్నో రెట్లు అభివృద్ధిలో వుండేవాళ్ళం. అందులో సందేహంలేదు. కాని యిక్కడ మీరు గుర్తించ వలసింది బ్రిటిషుసామ్రాజ్యప్రభుత్వానికి మనల్ని దారిద్ర్యం లోనే అట్టిపెట్టాలనే దృష్టివున్నా సామ్రాజ్యతత్వంలో వున్న పరస్పరవైరుధ్యంవల్ల అలా అట్టిపెట్టటానికి వీల్లేదని.

బ్రిటిషుసామ్రాజ్యప్రభుత్వం యెప్పటినుంచి మన దేశంలో పరిశ్రమలు స్థాపిస్తేకాని లాభంలేదని గ్రహించిందో చెప్పమంటే ఫలానా తేదీ అని చెప్పటం కష్టం. కాని బ్రిటిషుసామ్రాజ్య ప్రభుత్వం కూడా యీ విషమపరిస్థితిలో పడిందనే చెప్పవచ్చు. క్రిందటి యుద్ధానంతరం యీ పరిస్థితి మరీ విషమంగా పరిణ మించింది. యుద్ధంవల్ల ఇంగ్లండు అదివరకు మనకు పంపుతున్న వస్తువుల్ని పంపలేకపోయింది. యీ ఆసరా చూచి జపాను మన దేశ మార్కెట్టుని, కొంతవరకు చైనామార్కెట్టుని పట్టు కుంది. యుద్ధం కాగానే జర్మనీ, ఆస్ట్రియా, ఇటలీ, బెల్జియం దేశాలనుంచి కూడా చౌకపారువస్తువులు రాసాగినై. ఇంగ్లండు వీటితో పోటీ చేయలేకపోయింది. యేంచేస్తుంది? అంతకంటె చౌగ్గా అమ్మాలంటే యిక్కడ పరిశ్రమలన్నా స్థాపించాలి. లేకపోతే తనదేశంలోని శ్రామికులకు సగానికి సగం కూలి విరగ్గోయాలి. ఇంగ్లండులోని శ్రామికులు తమ జీతాలు తగ్గిం

చితే యెదురుతిరుగుతారు కాబట్టి ఇండియాలో పరిశ్రమలు స్థాపించటం అవసరం అయింది. వెంటనే ప్రభుత్వం పారిశ్రామిక విధానాన్ని తయారుచేయటానికి వొక కమిటీ నెన్నుకుంది. యీ కమిటీ ఆధునిక పరిశ్రమలు అభివృద్ధిచేయటానికి వొక స్కీము తయారుచేసింది. కాని ప్రభుత్వం దీన్ని ఆచరణలో పెట్టలేకపోయింది.

బ్రిటిషుప్రభుత్వం మనల్ని మోసంచేయటానికి యీ కమిటీని వేసింది. కాని నిజంగా దానికి యిక్కడ పరిశ్రమలు అభివృద్ధి చేయటానికి యిష్టం లేదని జాతీయవాదులు వాదిస్తారు. కాని దీన్ని యథార్థం అంటానికి వీల్లేదు. ప్రభుత్వానికి యిష్టంలేక పోతే పారిశ్రామిక కమిటీనివేయటం అనవసరం. కాని యింత కంటె ముఖ్యకారణం యింగ్లండునుంచి తెచ్చి యిక్కడ పరిశ్ర మలు స్థాపించటానికి కావలసినంత పెట్టుబడి లేదు. ప్రభుత్వం యింతటితో వూరుకోలేదు. తరువాత ప్రభుత్వం మనదేశంలో పెట్టుబడిపెట్టగల పరిస్థితులు యెంతవరకుంటుందో తెలుసుకోటా నికి ఫిస్కల్ కమిటీని, బ్యాంకింగ్ కమిటీని వేసింది. వీటి రిపోర్టు వల్ల దేశంలో పెట్టుబడిధనం చాలా వుందని తేలింది. దేశీయ పరిశ్రమలకు రక్షణ లివ్వాలని ఫిస్కల్ కమిటీ సిఫార్సు చేసింది. ప్రభుత్వం అంగీకరించింది. తాతా ఐరన్ కంపనీ, టెక్స్టయిల్ మిల్లులు మొదలైనవాటికి రక్షణ లీయబడ్డవి. కాని పరిశ్రమలు అభివృద్ధిచెందవలసినంతగా అభివృద్ధిచెందలేదు. కారణం ? ప్రజల దారిద్ర్యం, ప్రజల్లో కొనుగోలుశక్తి లేకపోవటం.

ప్రజల స్థితిగతులను తెలుసుకోటానికి ప్రభుత్వం వ్యవసాయ కమిటీ నొకదాన్ని వేసింది. ఈ కమిటీ వ్యవసాయపద్ధతుల్లో చేయవలసిన మార్పులన్నీ చూపిస్తూ వొక రిపోర్టు తయారు చేసింది. కాని దీన్ని ఆచరణలో పెట్టటం అసాధ్యం అయింది. మళ్ళీ అదే కారణం. రైతు చాలా దరిద్రావస్థలో వున్నాడు. వ్యవసాయపద్ధతులు ఆధునికం చేయటానికి అతనిదగ్గర డబ్బు లేదు. యింతటితో ప్రభుత్వప్రయత్నం ఆగిపోయింది.

ప్రభుత్వానికి యిష్టంలేకపోయినా పారిశ్రామిక, ఫిస్కల్, బాంకింగ్, వ్యవసాయకమిటీలను వేసి కేవలం మనల్ని మోసం చేయటానికి ప్రయత్నించిం దనుకుంటే మనం యథార్థాన్ని తెలుసుకోలేము. భారత దేశం పారిశ్రామికంగా అభివృద్ధి చెందటంవల్ల వొకవిధంగా ఇంగ్లండుకే లాభం కనబడింది. అందువల్ల పరిశ్రమలు స్థాపించటానికి ప్రయత్నించింది. కాని తనదగ్గర కావలసినంత డబ్బు లేదు. దేశీయ పెట్టుబడిదారుల్ని ప్రోత్సహించింది. కాని తగినంతగా పరిశ్రమలు వృద్ధికాలేదు. కారణం విదేశమార్కెట్టులుంటే కొంతవరకు అభివృద్ధి చెందేవి. అది లేదు. పోనీ దేశీయమార్కెట్టులోనే వస్తువులు అమ్ముడుబోతయ్యా అంటే అదికూడా లేదు. ప్రజలు దరిద్రావస్థలోవుండి తమకు అవసరం అయిన సరుకులుగూడా కొనుక్కునే స్థితిలో లేరు.

ఈ సమస్య యిప్పటికీ అలాగేవుంది. యుద్ధావసరాలవల్ల యిప్పుడు యేవో కొన్ని అదనపు పరిశ్రమలు స్థాపించబడ్డా

యింతమాత్రంచేత పారిశ్రామికాభివృద్ధి అవుతుందనుకోగూడదు. ఇంతకంటె యెన్నోరెట్లు అభివృద్ధి కావాలి. కావాలంటే ప్రజల దారిద్ర్యం తగ్గాలి. మళ్లీ తిరిగి అదే సమస్య.

## పరిశ్రమలు—కాపిటలిస్టు విధానం

యుద్ధానంతర భారతదేశసమస్య పరిశ్రమలు వృద్ధిచేయటం, దేశంలో వున్న దారిద్ర్యాన్ని పోగొట్టటం. కాని వొకదాని మీాద వొకటి ఆధారపడివున్నై యని చెప్పాను. కాబట్టి యీా సమస్య తేలదని కూర్చుంటే ప్రయోజనంలేదు. యీా విషమ పరిస్థితినుంచి భారతదేశప్రజానీకాన్ని తప్పించేమార్గం చూడాలి.

దీనికి వొకటే ఉపాయం. యీా సమస్యని పరిష్కరించాలంటే నేటి పెట్టుబడిదారీ ఆర్థికవిధానం పనికిరాదు. కొత్త ఆర్థిక విధానం అమలుపరచాలి. ఆ విధానం ఒకదెబ్బతో రెండుపిట్టల్ని కొట్టే విధానం కావాలి.

ఇంతవరకు కాపిటలిస్టు విధానం వల్లనే ప్రపంచంలో పరిశ్రమలు అభివృద్ధిచెందినై. కాపిటలిస్టుదేశాలన్నీ పారిశ్రామికంగా అంతులేని ఉత్పత్తిని చేయగలుగుతున్నై. కాబట్టి కాపిటలిస్టువిధానంవల్ల పరిశ్రమలు అభివృద్ధికాటానికి, ఉత్పత్తి యెక్కువకాటానికి యెందుకు వీల్లేదని మీారు ప్రశ్నించవచ్చు. పరిశ్రమలు అభివృద్ధిచెందకుండా వుంటానికి ప్రజానీకంలోవున్న దారిద్రం అడ్డువస్తుందనుకుంటే ఆ దేశాల్లో ప్రజలు దరిద్రంతో అవస్థపడటంలేదా, అయినా పరిశ్రమలు బాగానే అభివృద్ధి

చెందినై యని కూడా మీరు ప్రశ్నించవచ్చు. నిజమే. అయినా నా సమాధానం కూడా వినండి.

కాపిటలిస్టు దేశాల్లో, వొకపక్క ప్రజలు దారిద్ర్యంలోవున్నా మరోపక్క పరిశ్రమలు అభివృద్ధి చెందినై. దీనికి కారణం యేంటి? ప్రపంచంలో నాగరికతలో వెనుకబడివున్న దేశాలన్నిటినీ యీ దేశాలు ఆక్రమించుకున్నై. కాబట్టి తమ దేశంలో ప్రజలు దరిద్రంలోవున్నా కాపిటలిస్టులకు పరిశ్రమలు అభివృద్ధిచేసి తాము ఆక్రమించుకున్న దేశాలకు వస్తువుల్ని పంపి లాభాలు సంపాదించటానికి వీలుంది. అందుకనే పరిశ్రమలు అభివృద్ధిచెందినై.

కాని యుద్ధానంతరం కూడ ప్రపంచ పరిస్థితులు అలా వుంటానికి వీల్లేదు. యీ యుద్ధఫలితంగా ప్రతి దేశంలోనూ, పరిశ్రమలు అభివృద్ధి చెందుతున్నై. మనదేశం చూడండి. 1939 నాటికీ యిప్పటికీ పారిశ్రామికంగా చాలా తేడావచ్చింది. అప్పుడు తయారుచేయలేని వస్తువుల్ని యిప్పుడు మనం తయారు చేసుకుంటున్నామ్. నావికా నిర్మాణం జరుగుతుంది. మోటారుకారులు, సైకిళ్ళు తయారవుతున్నై. ఆయుధవుత్పత్తి జరుగుతుంది. ఇంకా అనేకరకాలవస్తువులు ఉత్పత్తిఅవుతున్నై. వీటన్నిటిని యుద్ధానికిపూర్వం చాలావరకు ఇతర దేశాల్నుంచి, ముఖ్యంగా యింగ్లండునుంచి తెప్పించుకొనేవాళ్ళం. యికనుంచి మనం వీటిని యితర దేశాల్నుంచి తెప్పించుకోనక్కర్లేదు. ఇలాగే ఇంతవరకు పారిశ్రామిక అభివృద్ధి లేనిదేశాల్లో అభివృద్ధి జరుగు

తుంది. ఇదివరకు పారిశ్రామికంగా ముందున్న దేశాల్లో యింకా యెక్కువ అభివృద్ధి జరుగుతుంది.

కాబట్టి యుద్ధానంతరం కూడ యుద్ధానికి పూర్వంలాగా కాపిటలిస్టు దేశాలు తాము యిదివరకు పంపుతున్నట్లుగా వస్తువుల్ని పంపటానికి వీల్లేదు. ఇండియానే మళ్ళీ ఉదాహరణకు తీసుకుందాము. ఇంగ్లండు మనకు యిదివరకు పంపే వస్తువుల్ని కొన్నింటిని యిప్పుడు తయారు చేసుకుంటున్నాం. కాబట్టి యుద్ధానంతరం ఇంగ్లండు తిరిగి అవే వస్తువుల్ని పంపుతానంటే కుదరదు. వాటిని వదలిపెట్టి మనం యింతవరకు తయారు చేసుకోని వస్తువుల్ని పంపితే మనం కొంటాము. ఇంగ్లండు అలా పంపినప్పుడే మనకీ, ఇంగ్లండుకీ వ్యాపారం వుంటుంది. లేకపోతే సంబంధం వుండదు. ఇలా ప్రతిదేశంలోనూ యింతే.

అందుకనే లండను వాణిజ్యసంఘం యుద్ధానంతరం పారిశ్రామికవిధానంలో మార్పు తీసుకురావాలంటుంది. అంటే యిప్పుడున్న కాపిటలిస్టు ఆర్థికవిధానం, తమ యిష్టంవచ్చిన వస్తువుల్ని తయారుచేసి లాభాలకోసం విదేశ మార్కెట్లని వెదకటం, కుదరదని యిలాకాకుండా అంతర్జాతీయ పారిశ్రామికాభివృద్ధి ననుసరించి ప్రతి దేశంలోనూ ఆర్థికవిధానం మార్చుకోవాలని నిశ్చయించింది.

ఈ విషయంలో యీ వాణిజ్యసంఘం నియమించిన స్పెషల్ కమిటీ యింకా స్పష్టంగా చెప్పింది. “యింతవరకు

కాపిటలిస్టు దేశాల్లో ఆర్థిక మాంద్యాలు రావటం ఉత్పత్తి యెక్కువకావటం చేతకాదు. కావలసినంత సరుకు ఉత్పత్తి అవుతున్నా ప్రజలకోసం వినియోగం జరగటంలేదు. ప్రజల కొనుగోలుశక్తి హెచ్చించినట్లయితే, అంటే ప్రజలకి అన్ని వస్తువులు కొనుక్కోటానికి వీలైనంత చౌగ్గా వస్తువుల్ని వారి అందుబాటులో ఉంచినట్లయితే వారి జీవిత పరిమాణం పెరగటానికి వీలుండేది. దీనివల్ల ఉత్పత్తి యెక్కువ అవుతుందనే ప్రశ్న ఉదయించేది కాదు. కాబట్టి యికముందు ఆర్థిక విధానమంతా యిదే దృష్టితో వుండాలి."

లండను వాణిజ్యసంఘం ప్రపంచపరిస్థితుల్ని తెలుసుకోటం చేత కాపిటలిస్టు ఆర్థికవిధానంవల్ల ప్రయోజనం లేదని గ్రహించింది. కాపిటలిస్టు ఆర్థికవిధానంవల్ల యేమాత్రం లాభం కనబడ్డా వాణిజ్యసంఘం (పెట్టుబడిదారులు) వదలిపెట్టుతుందనుకోటం దుర్భ్రమ. లాభంలేనప్పుడు దాన్ని పట్టుకుని వ్రూగులాట్టంకంటె ఇంకోదాన్ని, యిష్టంలేకపోయినా ప్రజా శ్రేయస్కరం వాళ్ళతోబాటు తమది కనబడుతుంద కాబట్టి అదే ఆచరించటం మంచిదని తేల్చింది.

ఇక యిండియాసంగతి చూద్దాం. దేశంలోని ప్రజ లెలావున్నా కాపిటలిస్టు ఆర్థికవిధానంతో పరిశ్రమలు ఉత్పత్తిచేయటానికి వీల్లేదు. కారణం యిలా పరిశ్రమలు అభివృద్ధి కావాలంటే మనకన్నాడా మనకంటె నాగరికతలోనూ, పారిశ్రామికంగానూ వెనకబడివున్న వలసదేశాలు కావాలి. కాని అలాంటి

దేశాలు లేవు. పైగా యుద్ధానంతరం విదేశమార్కెట్లకంటె స్వదేశంలోనే ఉత్పత్తి నంతా వినియోగించితేనే పరిశ్రమలు నిలబడివుంటానికి, అభివృద్ధిచెందటానికి వీలుంది. కనుక యిండియాలో పారిశ్రామిక విధానం కాపిటలిస్టు ఆర్థికవిధానంతో జరగాలంటే కుదరదు. ఇటు పరిశ్రమలు అభివృద్ధి కావు—అటు ప్రజా దారిద్ర్యం పోదు.

## నూతన ఆర్థిక విధానం

ఈయుద్ధ ఫలితంగా కాపిటలిస్టు ఆర్థికవిధానం పనికిరాదని, నూతన ఆర్థికవిధానం కావాలని ఇతర దేశాలన్నీ గ్రహించినై. ఆ నూతనవిధానం యెలావుండాలో యుద్ధానుభవంవల్ల తెలుసుకున్నై. భారతదేశంకూడా యుద్ధానంతరం అంతర్జాతీయ నూతన వ్యవస్థలో చేరాలంటే ఇదే పంథా నవలంబించాలి. యుద్ధానంతర ఇంగ్లండు యిందుకు మార్గదర్శి కాగలదు. దేశం భాగ్యవంతం కావాలంటే మనం యీ పంథా ననుసరించాలిలేకపోతే స్వరాజ్యం వచ్చినా దరిద్రం అలాగే వుంటుంది.

ఇప్పుడు యేవో కొన్ని పరిశ్రమలు అభివృద్ధిచెందుతున్నా, 40 కోట్ల జనాభాకు కావలసిన వుత్పత్తి జరగటం అసంభవం. కాబట్టి యెన్నో పరిశ్రమలు అభివృద్ధి కావాలి. పరిశ్రమలు అభివృద్ధి కావాలంటే దేశంలో కావలసినంత పెట్టుబడిధనం లేదు. కాబట్టి వొక్కసారిగా పరిశ్రమలు అభివృద్ధిచెందటానికి వీల్లే దనవచ్చును.

కాని మనం యీ యుద్ధంవల్ల కొంత లాభాన్ని పొందామని చెప్పాను. యుద్ధంవల్ల ఇంగ్లండు ఇండియాకి కొన్ని వందల కోట్లు బాకీ పడింది. దీన్ని యుద్ధానంతర యిండియాలో పరిశ్రమలు అభివృద్ధి చేయటానికి పెట్టుబడిధనంగా ఉపయోగించటానికి వీలుంది. కొంతమంది ఇంగ్లండు బాకీవుంటే వుండవచ్చు; కాని యుద్ధం పూర్తికాగానే ఋణం అంతా యెగ్గొట్టితే యేం చేస్తామని ప్రశ్నించవచ్చు. అదీ నిజమే.

కాని అంతర్జాతీయ వ్యాపారసరళి తెలిసినవారికీఅనుమానం రాదు. అంతర్జాతీయ వ్యాపారమంతా చాలావరకు అరువు (క్రెడిట్) మీదే జరుగుతుంది. అసలు వ్యాపారం జరగటంవల్ల ఉభయదేశాలకీలాలాభం. ఒకసారీబాకీ యెగ్గొట్టితే ఇక ఆ ఉభయదేశాలకీలాభం వ్యాపారం వుండదు. దీనివల్ల ఉభయదేశాలకీ నష్టం. ఇక్కడ మరోవిషయం కూడా మీకు చెప్పటం ముఖ్యం. యుద్ధానంతరం అంతర్జాతీయ ఋణాలన్నీ రొఖ్ఖం (బంగారం, వెండి)గా కాక కేవలం వస్తువులరూపంలో చెల్లించాలని తీర్మానించింది. యిలా చెల్లించటంవల్ల వ్యాపారం అభివృద్ధి కావటానికి, తద్వారా బాకీపడిన దేశం కూడ కొంత లాభించటానికి వీలుంది.

యుద్ధానంతరం ఇంగ్లండులో ప్రజాప్రభుత్వం రావటానికి వీలుందని చెప్పాను. ప్రజాప్రభుత్వం రాదనుకున్నా ఫాసిస్టు ప్రభుత్వం, సామ్రాజ్యప్రభుత్వం వుంటానికి వీల్లేదు. కాబట్టి అంతకంటె మంచిప్రభుత్వమైనా వస్తుందని గట్టిగా చెప్పవచ్చును.

సామ్రాజ్యప్రభుత్వం ఉండనప్పుడు ఇంగ్లండు మన ఋణాలు యెగ్గొట్టుతుందనే భయంలేదు. మన ఋణాలు వస్తువులద్వారా చెల్లిస్తూనే మనతో యెక్కువ సంబంధం పెట్టుకొని తనకు కావలసిన వస్తువుల్ని, ఆహార పదార్థాల్ని మన దగ్గరనుంచి కొనుక్కోటానికి ప్రయత్నిస్తుంది. ఋణాలుయెగ్గొట్టితే మనం సంబంధం తెంచుకుంటాము. ఇది యింగ్లండుకే నష్టం. కాబట్టి తన క్షేమంకోసం అయినా ఇంగ్లండు మన ఋణాల్ని చెల్లిస్తుంది.

ఇంగ్లండు మన ఋణాల్ని వస్తువులద్వారా చెల్లిస్తుందని చెప్పాను. కాని యే వస్తువులో నిర్ణయించుకోవలసింది మనం. ప్రజల వినియోగంకోసం వస్తువులు పంపితే యిక్కడ ప్రజల్లో కొనే శక్తిలేదు. కాబట్టి దానివల్ల మనకు ప్రయోజనం లేదు. యిక్కడ పరిశ్రమలు పూర్తిగా అభివృద్ధిచెందితే కాని ప్రజల్లో కొనుగోలు శక్తి రాదు. కనుక ముందు పరిశ్రమలు వృద్ధి చెయ్యాలి. మనకు యివ్వవలసినఋణాల్ని యిందుకు ఉపయోగించుకోవచ్చును. మనం ఇంగ్లండునుంచి మన కివ్వవలసిన బాకీకి యంత్రసామగ్రిని, ఫ్యాక్టరీ పనిముట్లను తెప్పించుకోవచ్చు. ఈ విధంగా మనం యిండియాలో పరిశ్రమలు స్థాపించటానికి వీలుంది.

ఇంగ్లండూ ఇండియా కివ్వవలసిన ఋణాలు యే కొద్దిమంది వ్యక్తులకు సంబంధించినవి కావు. జాతి కంతటికీ సంబంధించిన ఋణం. కాబట్టి ప్రభుత్వం పరిశ్రమలు స్థాపించి వీలైనంత చౌకలో ప్రజలకు అందుబాటులో వుండేటట్లు వస్తువులు విక్ర

యించాలి. అంటే వస్తువుల్ని లాభంకోసం కాక ప్రజల విని యోగంకోసం ఉత్పత్తిచెయ్యాలి. దీనివల్ల ప్రజల జీవిత పరి మాణం హెచ్చుతుంది. పరిశ్రమలు స్థాపించటంచేత యెక్కువ శ్రామికులను ఉపయోగించవలసివస్తుంది. దీనిద్వారా ప్రజల్లో కొనుగోలు శక్తి యెక్కువ కాటానికి వీలుంది. కొనుగోలుశక్తి యెక్కువ కాగానే తిరిగి కొత్త పరిశ్రమలు స్థాపించే అవసరం కనిపిస్తుంది. యీ విధంగా ఒకదాంతరువాత వొకటిగా పరిశ్ర మలు అభివృద్ధి చేయటానికి వీలుంది.

ప్రజల్లో కొనుగోలుశక్తి తగ్గకుండా చూట్టం ప్రభుత్వ కర్తవ్యం. తగ్గకుండా చేయాలంటే కరెన్సీ చలామణిని బట్టి ఉంటుంది. ఉత్పత్తి అయ్యేదానికంటె కరెన్సీ చలామణి యెక్కు వైతే ధరలు పెరగటానికి వీలుంది. ప్రజలు కొనుక్కునే స్థితిలో వుండరు. చలామణి తక్కువైతే ధరలు పడిపోటానికి వీలుంది. కాబట్టి పండించే రైతు దెబ్బతింటాడు. కాబట్టి ఉత్పత్తినిబట్టి కరెన్సీ చలామణి హెచ్చిస్తూవుంటే ధరలునిలకడగా వుంటానికి పండించేవానికి, వినియోగించేవాని కిద్దరికీ లాభం. కేవలం కరెన్సీ పెంచినందువల్ల కూడా లాభంలేదు. కరెన్సీ వొకచోట అనవసరంగా దాచిపెట్టి వుంచేటట్లు చెయ్యగూడదు. కరెన్సీ మారకం యెక్కువగా జరిగితే వ్యాపారం, దాన్నిబట్టి పరిశ్ర మలు అభివృద్ధిచెందటానికి వీలుంది. ఈ విధంగా కరెన్సీ కంట్రోలుమార్గంలో నడిపితే ప్రజల కొనుగోలుశక్తి తగ్గకుండా వుంటానికి, జీవిత పరిమాణం హెచ్చటానికి వీలుంది.

తరువాత పరిశ్రమలు యింకా అభివృద్ధికావాలంటే వ్యవ సాయంలో నూతన మార్పులు చెయ్యాలి. యంత్ర సహా యంతో వ్యవసాయం చేయించితే దానివల్ల యింతవరకు వ్యవ సాయంకోసం వినియోగిస్తున్న మానవశ్రమ అక్కర్లేదు. ఇది వరకు 10 మంది చేసే పని ఒక రిద్దరితో పూర్తి అవుతుంది. తక్కిన 8 మంది పరిశ్రమల్లో పాల్గొంటే యిటు వీరి కొనుగోలు శక్తి అటు ఆ యిద్దరిది యెక్కువకాటానికి వీలుంది. తరువాత రైతు పండించేదానికి యిప్పటికంటె యెక్కువ ధరలు వచ్చే టట్లు చేస్తే రైతుల్లో జీవిత పరిమాణం హెచ్చి తద్వారా పరి శ్రమలు యింకా అభివృద్ధిచెందటానికి వీలుంది.

ఈ విధంగా భారతదేశం పారిశ్రామిక కేంద్రం చేసి ప్రజా నీకాన్ని దారిద్ర్యంలోనుంచి తప్పించాలంటే యుద్ధానంతరం ఆర్థికవిధానం కాపిటలిస్టుతత్వం ప్రకారం నడిపితే లాభంలేదు. ఒక నిర్ణీత కార్యక్రమంతో ఉత్పత్తిని లాభాలకోసం కాక సమాన పంపకం చెయ్యటానికి వినియోగిస్తేనే యీ కార్యం సాధించటానికి వీలుంది. ఇలాంటి ఆర్థికవిధానం అమల్లో పెట్టితే వొక్క భారత ప్రజానీకానికే కాదు, భావి నూతన ప్రపంచ వ్యవస్థకే భారతదేశం యెంతో మేలుచేసినదౌతుంది.

## సాధనం

ఇంతవరకూ యుద్ధానంతర భారత సమస్య పరిష్కరించే దెలాగో చెప్పాను. మన గమ్యస్థానం భారత ప్రజానీకాన్ని

బానిసత్వంలోనుంచి, దరిద్రంలోనుంచి తప్పించటం. దీని కొరకు మార్గం కనిపెట్టాము. కాని యింతటితో మన బాధ్యత తీరలేదు. యీ మార్గంద్వారా మన గమ్యస్థానం చేరటానికి మన కొరకు సాధనం కావాలి. యేది మంచిదో ఆలోచించటం ముఖ్యం. కాని మంచిదనుకున్నదాన్ని ఆచరణలో పెట్టటం అంతకంటె ముఖ్యం. కాబట్టి యే కార్యక్రమం ద్వారా మనం భారతసమస్యని పరిష్కరిస్తామనుకున్నామో ఆ కార్యక్రమాన్ని ఆచరణలో పెట్టటాని కొరకు సాధనం కనిపెట్టాలి. అంటే నా ఉద్దేశం అలాంటి కార్యక్రమాన్ని ఆచరణలో పెట్టే ప్రభుత్వం కావాలని.

## ఏ ప్రభుత్వం వుంటుంది ?

ఇప్పటి పరిస్థితుల్ని బట్టి, వివిధశక్తుల బలాబలాల్ని బట్టి యుద్ధానంతరం తప్పనిసరిగా వుండే ప్రభుత్వం యేంటో చెప్పటం కష్టం. కాని యే ప్రభుత్వం వస్తే మంచిదో తెలుసుకుంటే, తరువాత ఆ ప్రభుత్వం స్థాపించటాని కుండే సాధక బాధకాలేంటో ఆలోచిద్దాం.

యుద్ధానంతరం మూడురకాల ప్రభుత్వాలుంటానికి అవకాశం వుంది. (1) ఇప్పటిప్రభుత్వం (2) జాతీయప్రభుత్వం (పెట్టుబడిదారీ ప్రభుత్వం) (3) ప్రజాప్రభుత్వం. వీటిల్లో యేది ఉత్తమమైందో తెలుసుకుంటే తరువాత దాన్ని స్థాపించే పద్ధతి ఆలోచిద్దాం.

(1) <u>ఇప్పటిప్రభుత్వం</u>:— అంటే యిప్పుడు బ్రిటిషుప్రభుత్వం క్రింద యిండియాలో యేజంటుగా పనిచేస్తున్న ప్రభుత్వం. నూటికి యే వొక్కరో, యిద్దరో తప్ప యీ ప్రభుత్వం వుండాలనుకునేవారు మనదేశంలో వుండరు. కనుక మనం యీ విషయాన్ని యిక్కడ తర్కించటం అనవసరం అని మీలో కొంత మంది అనుకోవచ్చు. కానిఅక్కర్లేదనుకున్నదాని సంగతి ఆలోచించకుండా పూర్తిగా విడిచిపెట్టి, కావాలనుకున్నదాని సంగతే ఆలోచిద్దామంటే నేను వొప్పుకోను. మనం యిక్కడ రాజకీయంగా అన్నివిషయాలు సిద్ధాంతరీత్యా చర్చించటానికి సమావేశం అయ్యాం కాబట్టి మంచి, చెడ్డ అన్నివిషయాలు కూలంకషంగా ఆలోచించటం మంచిది.

ఇంతవరకూ మన రాజకీయపోరాటం అంతా బ్రిటిషుప్రభుత్వాన్ని యిక్కడనుంచి తొలగించటానికే జరిగింది. ఆ ప్రభుత్వం యిక్కడున్నంతవరకూ ముందుకూడా యిలాగేజరగాలని అనుకోటం సహజం. కాని కొంతమంది జాతీయప్రభుత్వం కావాలంటున్నారు. కొంతమంది ప్రజాప్రభుత్వం స్థాపించాలంటున్నారు. వీటి రెంటిల్లో యేది మంచిదో ఆలోచించే ముందు యిప్పటి ప్రభుత్వం వీటికంటె యెంత చెడ్డదో తెలుసుకోటం మంచిది. పరిస్థితులు వెనకటిలాగానే వుంటే యీ ప్రభుత్వాన్ని గూర్చి మనం యిక్కడ పెద్దగా ఆలోచించేది వుండేది కాదు. కాని యుద్ధంవల్ల అనేక మార్పులు వచ్చినై కాబట్టి యీప్రభుత్వంలో

కూడా అలాంటి మార్పులు వచ్చినయ్యా, లేక ముందు రావటానికి అవకాశం వుందా అదీకాక వెనకటిలాగానే ముందు కూడా యీ ప్రభుత్వం అలాగే వుంటుందా అనే విషయాలు ఆలోచించటం అవసరం అయింది.

యీ యుద్ధంవల్ల మనమీద అదివరకు ఇంగ్లండుకున్న ఆర్థికపెత్తనం తొలగిందని మళ్ళీ సంపాదించే అవకాశం లేదని వెనుక చెప్పాను. యీ పెత్తనం తొలగితే రాజకీయం వున్నా పోకపోయినా పోకేననికూడా చెప్పాను. కాబట్టి 'యుద్ధానంతరం యీ ప్రభుత్వం వుంటే' ననే ప్రశ్న ఉదయించదు. కాని మనలో మనకు తేలేదాకానో, లేక ప్రపంచంలో శాంతి యేర్పడేదాకానో, లేక యింగ్లండులో ప్రజాప్రభుత్వం అధికారానికొచ్చి మన దేశంలో యే ప్రభుత్వం వుంటే మంచిదో ఆలోచించేదాకానో యీ ప్రభుత్వం వుంటానికి వీలుంది. కనుక అంతవరకైనా యీ ప్రభుత్వం యే దృష్టిలో వుంటుందో ఆలోచించటం మంచిది.

ఇంగ్లండుప్రభుత్వంలో మార్పులు వస్తే దాని యేజంటు కాబట్టి యీ ప్రభుత్వంలో దాని కనుకూలంగా మార్పులు రావటానికి వీలుంది. యుద్ధంరానంతవరకూ ఇంగ్లండుప్రభుత్వం సామ్రాజ్యప్రభుత్వంగా వుంది కాబట్టి యిప్పటి యిండియా ప్రభుత్వం దాని యేజంటుగా యిక్కడ పనిచేసింది. యుద్ధానంతరం అక్కడ ప్రజాప్రతభుత్వం వస్తే యీ ప్రభుత్వం కూడా

దానిక్రిందే ఉంటే యిదివరకులాగా సామ్రాజ్యప్రభుత్వ యేజంటుగా ఉండదు. ప్రజాప్రభుత్వం యేజంటుగా ఉంటుంది. అట్టి పరిస్థితుల్లో యిండియాప్రభుత్వం యిదివరకంత నాసికట్టుగా ఉండదు. ఇంగ్లండుప్రభుత్వం అవలంబించే పద్ధతి ఇండియాప్రభుత్వంలో ప్రతిబింబిస్తుంది కాబట్టి ఆ దేశంలో జరుగుతున్న మార్పుల్నిబట్టి యీ దేశంలోగూడా జరగటానికి వీలుంది. కాబట్టి యుద్ధం రానంతవరకూ పెట్టుబడిదార్లకూ, భూస్వాములకూ అనుకూలంగా ఉన్న ఇండియాప్రభుత్వం యుద్ధానంతరం శ్రామికులకూ, రైతులకూ అనుకూలంగా వుండే అవకాశం కనబడుతుంది. ప్రభుత్వ ధోరణి యెలా మారుతుందో యిప్పటికే కొంత గోచరం అవుతుంది. కాని యింతవరకూ కాపిటలిస్టుతత్వంలోవున్న ప్రభుత్వం వొక్క-సారిగా దిగజారటం కష్టం. కాబట్టి ప్రభుత్వంలో జరుగుతున్న మార్పులు సామాన్యప్రజలు అర్థం చేసికోలేక పోవచ్చు. పెట్టుబడిదారుల వ్యాపారంలో ప్రభుత్వం యిప్పుడిప్పుడే చేయి చేసుకుంటుంది. సహకార సంఘాలు స్థాపించటంలో, కార్మికుల జీతాలు హెచ్చించటంలో, ధరలు కంట్రోలుచెయ్యటంలో ప్రభుత్వం పూర్తిగా ప్రజల అండ చేరకపోయినా షావుకార్లూ, పెట్టుబడిదార్లూ యిదివరకటిలాగా యిష్టంవచ్చినట్లు ప్రజానీకాన్ని దోపిడీచేయటానికి వీల్లేకుండా అడ్డువస్తుంది. ప్రభుత్వం యీ ప్రయత్నంలో సఫలం కాకపోవచ్చు కాని ప్రభుత్వ వెనుకటిపంథా మారిందికాబట్టి యివాళ కాకపోయినా రేపటికైనా ప్రభుత్వం ప్రజానీకానికి

మేలుచేస్తుందనే నమ్మకం యేర్పడటానికి అవకాశం కనబడుతుంది.

ప్రభుత్వం మంచిదైనప్పుడు యుద్ధానంతరంకూడ యిదే ప్రభుత్వం వుంటే నష్టం యేంటని మీరు ప్రశ్నించవచ్చును. అవును నష్టంలేదు. ప్రభుత్వం ప్రజాప్రభుత్వం అయినప్పుడు పరిపాలకులు మనవాళ్లైనా పరాయివాళ్లైనా వొకటే. మనకు కావలసింది ప్రజాదారిద్ర్యం నశించటం. ఆపని యెవరుచేసినా, పరాయివాడైనా మనమిత్రుడే. ఆపని చేయనప్పుడు మన వాడైనా మనకు శత్రువే.

కాని యిదిమంచిదనుకొని మనం యేమీచేయనక్కర్లేదులే అని కూర్చుంటే ప్రమాదం రావటానికి వీలుంది. యుద్ధానంత రంకూడా యిదే ప్రభుత్వం వుంటే ప్రజానీకం తమకు లాభం అని తెలుసుకో లేకపోయినా పెట్టుబడిదారులు తమకు నష్టం అని తెలుసుకొనుచున్నారు. తమస్వేచ్ఛా వ్యాపారం సాగ టానికి, ప్రజానీకాన్ని పీడించి దోపిడీచేయటానికి తమకు కావ లసినంత హక్కు వుండదని గ్రహించారు. తమయిష్టమువచ్చి నట్లు అధికారం చలాయించటానికి వీల్లేదు. అధికారం చలా యించాలంటే యీ ప్రభుత్వాన్ని తీసేసి తాము ప్రభుత్వాన్ని తమ కనుకూలమైన ప్రభుత్వాన్ని స్థాపించుకోవాలి. అందుకని యీ ప్రభుత్వం మంచిదికాదని, జాతీయప్రభుత్వం కావాలని ప్రచారం సాగించారు.

ఇండియాకి స్వయంనిర్ణయ హక్కువుందని, యుద్ధానంతరం ఇండియాకి స్వాతంత్ర్యం యిస్తామని బ్రిటిషు పార్లమెంటు ప్రక

టించింది. యీ ఆసరా చూచుకొని మాకు జాతీయ ప్రభుత్వం కావాలి, మీరు వెళ్ళిపొండి, మా దేశం మేమే యేలుకుంటా మని పెట్టుబడిదార్లు గగ్గోలుచేస్తున్నారు. ఇంగ్లండు యేంచేస్తుంది ? భారతీయులకు స్వయంనిర్ణయ హక్కువుందని ప్రకటించింది. 'మేమే రాజ్యాన్ని పరిపాలించుకుంటామని' యిక్కడివాళ్ళు, యెవరైనా కానీయండి ఇంగ్లండుని అడుగుతున్నారు. 'మీకు స్వయంనిర్ణయ హక్కు లేదు. మీరు పరిపాలించుకోటానికి వీల్లే'దని యింగ్లండు అంటుందా. ఇంగ్లండులో ప్రజా ప్రభుత్వం వస్తే యిండియాని తమకింద అట్టిపెట్టుకోటానికి యిష్టపడదు కాబట్టి యిక్కడ ప్రభుత్వాన్ని భారతీయులే నిర్ణయించుకోండని వదలిపెట్టుతుంది. అలాకాకుండా 'మేమే ప్రభుత్వాన్ని స్థాపిస్తాం, ప్రజల కష్టసుఖాలు గమనించి వారికి మేలుచేస్తాం' అని చెప్పితే యిక్కడ వినేవాడుండడు, పైగా అలా చేయటానికి ఇంగ్లండు ప్రయత్నించినా లాభంలేదు. జాతీయవాదులు సామ్రాజ్యతత్వం అని ప్రచారం చేస్తారు. ప్రజల్ని ప్రభుత్వం మీదికి వుసికొల్పుతారు. ప్రభుత్వానికి తగినబలం వుండదు. అరాచకం యేర్పడుతుంది. మనం యిప్పటిప్రభుత్వం మంచి దనుకున్నప్పుడు యీ ప్రభుత్వానికి సాయంచేసి జాతీయ ప్రభుత్వం రాకుండా యెందుకు ప్రయత్నం చేయకూడదని మీరు ప్రశ్నించవచ్చు. నిజమే యీ రెంటిలో యేది మంచిదో తేల్చుకోవలసి వచ్చినప్పుడు మనం వున్న ప్రభుత్వానికే సహాయం చెయ్యాలంటాము. కాని యిలా సహాయం చేద్దామనుకుంటే మనం అనుకున్నంతగా సహాయం చేయలేము.

ఈ ప్రభుత్వమే మంచిది. జాతీయ ప్రభుత్వం మంచిదికాదని ప్రచారంచేస్తే ప్రజానీకం సరిగ్గా అర్థంచేసుకోలేదు. పైగా మనల్ని అనుమానిస్తుంది. జాతీయ ప్రభుత్వం కావాలనే వారి బలం యెక్కువౌతుంది. మనం బలం సంపాదించటానికి వీలేదు. ఇట్టి పరిస్థితుల్లో మనం చేసేది యేమీ లేకపోగా జాతీయ ప్రభుత్వం తప్పనిసరి అవుతుంది.

కనుక మనం జాతీయవాదుల్ని, పెట్టుబడిదారుల్ని యెదుర్కొని వారి ఆశయం నెరవేరకుండా, మన ఆశయం నెరవేర్చుకోవాలంటే మనం వున్న ప్రభుత్వాన్ని కావాలంటే ప్రయోజనం లేదు. జాతీయ ప్రభుత్వానికి ప్రత్యామ్నాయంగా మరో ప్రభుత్వాన్ని చూపించాలి. ప్రజానీకానికి 'మీకు అనుకూలమైన ప్రభుత్వాన్ని, మీ ప్రాతినిధ్యంవుండే ప్రభుత్వాన్ని స్థాపించుకొండని' చెప్పాలి. జాతీయప్రభుత్వం వస్తే వారికి కలిగేనష్టం, వారి యిష్టంవచ్చిన ప్రజా ప్రభుత్వాన్ని స్థాపించుకుంటే వచ్చే లాభం స్పష్టంగా చూపించాలి. యిలా చేయటంవల్ల పెట్టుబడిదారుల యత్నాన్ని భగ్నంచేయటానికి, మన ఆదర్శం నెరవేరటానికి వీలుంది.

(2) <u>జాతీయప్రభుత్వం</u>:— ఇప్పటి ప్రభుత్వం మంచిదనుకున్నా యిది స్థిరంగా వుంటానికి వీల్లేదని తెలుసుకున్నాము. ఇక మిగిలింది భారతీయులకు కావలసింది జాతీయ ప్రభుత్వమా లేక ప్రజాప్రభుత్వమా అనే విషయం. ఇంతకుముందు ప్రజా ప్రభుత్వాన్ని స్థాపించటానికి ప్రయత్నించాలి. జాతీయ ప్రభుత్వాన్ని రాకుండా చెయ్యాలని చెప్పాను. కాని జాతీయప్రభుత్వం

వస్తే కలిగేనష్టం యేంటో మీకు చెప్పలేదు. మీరు జాతీయ ప్రభుత్వంవల్ల కలిగే నష్టాన్ని తెలుసుకుంటే ప్రజా ప్రభుత్వం యెందుకు కావాలో మీరే గ్రహిస్తారు. కాబట్టి జాతీయ ప్రభుత్వంవల్ల కలిగే ఫలితాన్నిగూర్చి చర్చిద్దాం.

కొంతమంది తీవ్రవాదులం అనుకునే వారుకూడ, జాతీయ ప్రభుత్వం మంచిదికాదనే వాదిస్తారు. కాని వారొక్కసారిగా ప్రజాప్రభుత్వం స్థాపించలేము; జాతీయ ప్రభుత్వానైతే స్థాపించటానికి వీలుంది. పైగా యీ ప్రభుత్వం వున్న ప్రభుత్వానికంటె మెరుగ్గా వుంటుంది. కనుక అందరం దానికోసం ప్రయత్నిద్దామని చెప్తుతారు. కాని నేను ఆవాదాన్ని ఒప్పుకోను. వున్న ప్రభుత్వంకంటె వచ్చే జాతీయప్రభుత్వం యెల్లా వుంటుందో, సరిగ్గా ఆలోచించకుండా బాగావుండక పోతుందా అని తృప్తిపడటం వొకటి, రెండోది మనం ప్రజాప్రభుత్వాన్ని వొక్కసారిగా స్థాపించలేమనే భయం—వీటివల్లవీరు జాతీయ ప్రభుత్వాన్ని కావాలంటున్నారు. కానినిజంగా ఆలోచిస్తే జాతీయ ప్రభుత్వం ప్రజా మేలు కోరకపోగా ఫాసిజాన్ని స్థాపించటానికి వీలుంది.

జాతీయవాదులు, పెట్టుబడిదార్లు జాతీయప్రభుత్వం కావాలంటున్నారు. జాతీయప్రభుత్వం వస్తేనేకాని యిండియాసమస్యలన్నీ పరిష్కారం కావంటున్నారు. వింటానికి బాగానేవుంది కాని మీరు శ్రద్ధగా తెలుసుకోవలసిన విషయం జాతీయ ప్రభుత్వం వస్తే ప్రజానీకానికి యేవిధంగా మేలు జరుగుతుందో, దారిద్ర్యం యెలా నశిస్తుందో యే జాతీయవాది కాని, యే

పెట్టుబడిదారుడు కాని స్పష్టంగా చెప్పటంలేదు. యిది ఇలా వుంచి పెట్టుబడిదారులు చేసే గూడుపుఠాణి కూడా మీకు కొంత చెప్తాతాను.

యీ యుద్ధంవల్ల ఇంగ్లండుకి యిండియా వెనకివ్వవలసిన బాకీ పోను తిరిగి ఇంగ్లండే యిండియాకి బాకీ పడింది. ఈ బాకీ పడటానికి కారణం యిక్కడప్రభుత్వం పెట్టుబడిదారుల దగ్గర రొఖ్ఖంయిచ్చి సరుకులు కొని ఇంగ్లండుకి, యితర దేశాలకూ పంపుతుంది. ఆ డబ్బు తిరిగి ఇంగ్లండు బ్యాంకిలో ఇండియా ప్రభుత్వంపేర జమ పడుతుంది. రొండోది ఇంగ్లండు, అమెరికా సైన్యాలకు యిక్కడ ప్రభుత్వం ఖర్చుపెట్టేదికూడ యింగ్లండు బ్యాంకిలో యీ ప్రభుత్వంపేర జమ పడుతుంది. యీ జమ అంతా ప్రభుత్వంపేర వుంది కాబట్టి రేపు తిరిగి యింగ్లండు చెల్లించవలసినప్పుడు ఇండియాప్రభుత్వానికే చెల్లిస్తుంది కాబట్టి ఆ వచ్చేదంతా భారతదేశం మొత్తంమీద వినియోగించవలసి వుంటుంది. అంటే యీ ఋణం తీర్చుకోటానికి యింగ్లండు పంపే సరుకులన్నీ పెట్టుబడిదారు లొక్కరే కాకుండా భారత దేశ ప్రజానీకం కూడా అనుభవించటానికి వీలుంది. దీనివల్ల దేశం మొత్తానికి లాభం కలుగుతుంది కదా! మరి పెట్టుబడి దారు లేంచేస్తున్నారో చూడండి.

పెట్టుబడిదారులదగ్గరనుంచి ప్రభుత్వం తీసుకుంటున్న సరుకు లికి రొఖ్ఖం యివ్వక్కర్లేదంటున్నారు. విదేశాలకు పంపే సరుకు లన్నీ తామే పంపుతామని, యింగ్లండుబ్యాంకిలో ఇండియా ప్రభుత్వంపేర కాక తమపేరనే జమకట్టించాలనీ అంటున్నారు.

దీనివల్ల రేపు యింగ్లండు తీర్చవలసిన బాకీలు యిండియాప్రభుత్వానికి కాకుండా తమకే చెల్లించవలసి వుంటుంది. అంటే వీటి మీద అధికారం తమకే ఉంటుంది. కనుక యుద్ధానంతరం వీలుంటే ఇంగ్లండులోనో, లేక యితర దేశాల్లోనో యీ ధనాన్ని పెట్టుబడిగా పెట్టి లాభాలు తీయాలని వీరి ఉద్దేశం. ఇంతవరకూ ఇంగ్లండు యిక్కడ చేస్తున్న పనిని, యిక నుంచి దేశీయపెట్టుబడిదారులు విదేశాల్లో చేయాలని యత్నం. మన దేశంలోని ప్రజ లెట్లావున్నా విదేశాల్లో వీరు వ్యాపారం సాగించి లాభాలు గుంజాలని వీరు యత్నం చేస్తున్నారు. ఇంగ్లండు యివ్వవలసిన ఋణాలు ఇండియాప్రభుత్వంపేర వుంటే వీరి ఆటలు సాగవు. అందుకని తమపేరుతో జమ కట్టించుకోటానికి వీరు నానా శ్రమలు పడుతున్నారు.

ఇంకో విషయం కూడ చెప్తాను. పెట్టుబడిదారు లొక వింతవాదాన్ని లేవదీశారు. "దేశంలో కరెన్సీ పెరగటంచేత ధరలు పెరిగినై. దానివల్ల పంటలుపండించే రైతులు, తదితరులూ కాస్తో కూస్తో డబ్బు నిలవచేసుకొని ఆహారపదార్థాలు నిల్వచేస్తున్నారు. దీని ఫలితంగా ఆహారపదార్థాల లోటు యేర్పడింది." ఈ సమస్యని తొలగించటానికి ప్రభుత్వం ప్రజల్లోనుంచి యుద్ధబాండుల ద్వారా అదనపు కరెన్సీ లాక్కుంటుంది. యిలా చేయటంవల్ల రైతులదగ్గర నిల్వధనం తగ్గుతుందని, తద్వారా వారు ఆహారపదార్థాలు నిల్వచేయటం తగ్గుతుందని ప్రభుత్వ వుద్దేశం. కాని పెట్టుబడిదారులు మరో మార్గం

చూపించారు. "ఇండియాకు యింగ్లండు ఇవ్వవలసిన ఋణాలు అమెరికా డాలరులోకి మార్చి అమెరికానుంచి బంగారం, వెండి తెప్పించి యిక్కడమ్మితే కాస్తో—కూస్తో డబ్బు మిగుల్చుకుంటున్న వాళ్ళంతా కొనుక్కుంటారు. తద్వారా అదనపు కరెన్సీ తగ్గుతుంది. ధరలు పడిపోతై. రైతుల్లో కొనుగోలుశక్తి తగ్గుతుంది. రైతులు ఆహారపదార్థాలు నిల్వచేయటానికి వీల్లేదు. ఈ విధంగా ఆహారసమస్యని పరిష్కరించటానికి వీలుందని."

ఇది మీరు బాగానే ఉందనుకో వచ్చు. కాని అసలు కీలకం యిది. ఇంగ్లండు యివ్వవలసిన అప్పు యుద్ధానంతరం సరుకులరూపంలో యిస్తుంది. దీనివల్ల దేశీయ పెట్టుబడిదారులకు లాభంలేదు. కనుక యిప్పుడే అమెరికను డాలరుకు మార్చి అక్కడనుంచి వెండి, బంగారం తెప్పించి యిక్కడ అమ్మితే కాస్తో—కూస్తో తెలివుండి వ్యాపారం చేసుకుంటున్నవా డెవడూ కొనడు. అమాయిక రైతులే కొంటారు. దీనివల్ల రైతుకి వచ్చేదేమీ లేకపోయినా పెట్టుబడిదారుల తంత్రం పారుతుంది. ప్రజల కొనుగోలుశక్తి తగ్గుతుంది. దానివల్ల ప్రజల్ని దాస్యంలోనూ, అజ్ఞానంలో అట్టిపెట్టటానికి వీలుంది. యుద్ధానంతరం తిరిగి ధరలు పడిపోతే పెట్టుబడిదారులు దరిద్రం అనుభవిస్తున్న రైతులదగ్గరనుంచి నెమ్మదిగా వెండి, బంగారం లాక్కొని విదేశాలతో వ్యాపారం చేయవచ్చు. అలాకాకుండా ప్రభుత్వం యుద్ధబాండుల ద్వారా అదనపు కరెన్సీ లాక్కుంటే రైతుల కంటె వ్యాపారస్థుల దగ్గరనుంచే యెక్కువ లాక్కొంటుంది.

కనుక దీనివల్ల వ్యాపారస్థులు రైతు నిల్వచేస్తున్నాడనే పేరుతో రహస్యంగా తాము నిల్వచేసుకోటానికి వీల్లేదు. అసలు విషయం, నేడు ఆహారపదార్థాలలోటు యేర్పడటానికి రైతుకంటె మధ్యవ్యాపారస్థుడు కొని నిల్వచేయటంవల్లనే. కనుక ప్రభుత్వం ఇంగ్లండుఋణాల్ని తమపేరుతో జమకట్టించటానికి వొప్పుకోకపోయినా కనీసం యీవిధంగానైనా ఇంగ్లండుఋణాలు యిండియాకి చేర్పించితే యివ్వాళ కాకపోయినా రేపైనా తాము లాక్కోటానికి వీలుంటుందని పెట్టుబడిదారుల ఆలోచన.

ఈ పెట్టుబడిదారులే జాతీయ ప్రభుత్వం కావాలంటున్నారు. జాతీయప్రభుత్వం అంటే వీరి అధికారానికి లోబడిన ప్రభుత్వం. అలాంటి ప్రభుత్వం వస్తే యేం జరుగుతుందో వినండి. వీరు స్వేచ్ఛావ్యాపారం ద్వారా ప్రజల్ని దోపిడీచేసి లాభాలు గడించటానికి ప్రయత్నిస్తారు. విదేశమార్కెట్టులన్నా వుంటే ప్రజలెలావున్నా పరిశ్రమలు వృద్ధిచెందటానికి వీలుందనుకుంటే యుద్ధానంతరం విదేశమార్కెట్లు వెనకటిలాగా ఉండవు. కనుక ఉత్పత్తి అయిందంతా దేశంలోనే ఖర్చుఅయ్యేటట్లు చూడాలి. కాని ప్రజల్లో కొనుగోలుశక్తి లేనంతవరకు ప్రజలు ఉత్పత్తిఅయిన సరుకుల్ని కొనుక్కునే స్థితిలో ఉండరు. ప్రజల్లో కొనుగోలుశక్తి హెచ్చించాలంటే ఉత్పత్తి అయ్యే సరుకుల్ని వీలైనంతచౌకలో ప్రజల కందుబాటులో ఉండేటట్లు చెయ్యాలి. కాని పెట్టుబడిదారులిందు కొప్పుకోరు. ప్రభుత్వం విషమపరిస్థితి కొస్తుంది. ప్రజా వినియోగంకోసం ఉత్పత్తిఅయ్యే

వస్తువుల్ని తగ్గిస్తుంది. కాని దారిద్ర్యంలోవున్న ప్రజలు మెదుగు తిరక్కుండా చూడాలి. ధనికవర్గం వ్యాపారం చేయటానికి, లాభాలు పొందటానికి యిటు ప్రజల్ని అణచటానికి మిలిటరీ శక్తిని, యుద్ధ పరికరాలను హెచ్చుచేయక తప్పదు. ప్రజల్లో జాతీయవాదుల ద్వారా "నిరాడంబరంగా ఉండాలి, ఖర్చులు తగ్గించుకోవాలి, స్త్రీలు వంటచెయ్యాలి, ప్రభుత్వం చెప్పింది చెయ్యాలి" అనే తత్వం ప్రచారంచేస్తుంది. అంటే పెట్టుబడి దార్లు ఫాసిజాన్ని స్థాపిస్తారన్న మాట.

జాతీయ ప్రభుత్వంవస్తే యిదీ జరిగేది. స్వతంత్రం కావాలనే ప్రజలు అలాగే వుండిపోతారు. కనుక జాతీయ ప్రభుత్వం కంటె యిప్పటి ప్రభుత్వమే మెరుగని వెనక చెప్పటానికి కారణం. కాని యీ ప్రభుత్వం వుంటానికి వీల్లేనప్పుడు మనం కోరవలసింది జాతీయ ప్రభుత్వంకాదు. ప్రజా ప్రభుత్వం,—కాపిటలిస్టు ఆర్థికవిధానం కోరే ప్రభుత్వంకాదు. ప్రజాస్వామిక ఆర్థిక విధానంకోరే ప్రభుత్వం.

3. <u>ప్రజా ప్రభుత్వం:</u>— ప్రజా ప్రభుత్వం అంటే నేనంతగా చెప్పనక్కర్లేదు. కాని వొకటి రెండుమాటల్లో యీ విషయం చెప్పిముగిస్తాను. ప్రభుత్వాధికారం అంత పూర్తిగా ప్రజలకే వుండాలి. ప్రజాప్రాతినిధ్యం వహించి ప్రజల సౌఖ్యంకోసమే పనిచేసే పరిపాలకుల ద్వారాప్రభుత్వం నడవాలి. పరిశ్రమలను పూర్తిగా అభివృద్ధిచేసి, అన్నివస్తువులు ప్రజలు కొనుక్కునేటంత చౌకగా వారికందుబాటులో వుండేటట్లుచేసి ప్రజా జీవితపరి

మాణాన్ని హెచ్చించాలి. ఉత్పత్తి లాభాలకోసం కాక తిరిగి సమాన పంపకంకోసం జరగాలి. స్త్రీ, పురుషులకందరికీ సమాన హక్కులిచ్చి, నిర్బంధ విద్యావిధానం పెట్టి, వీలైనంతవరకు మానవశ్రమని తగ్గించి, వైజ్ఞానిక అభివృద్ధి కలిగేటట్లు చెయ్యాలి. నిరుద్యోగసమస్యని పరిష్కరించాలి. ప్రజల్లోవున్న దరిద్రాన్ని నామరూపాలు లేకుండా నాశనం చెయ్యాలి. ఇలా చేసేదే ప్రజా ప్రభుత్వం. కాబట్టి మన గమ్యస్థానం చేరాలంటే యుద్ధానంతరం భారత దేశంలో యిలాంటి ప్రభుత్వం వస్తేనేతప్ప చేరలేము.

## ముగింపు.

ఇండియాకి స్వయంనిర్ణయ హక్కువుందని, బ్రిటిషుప్రభుత్వం ప్రకటించిందని చెప్పాను. ఆ స్వయంనిర్ణయ హక్కు పెట్టుబడిదారులచేతుల్లో పడకుండా వుండాలి. ఆ హక్కు ప్రజానీకానికి చెందాలి. కనుక ప్రజాస్వామికంకోరే వారంతా భారతదేశానికి కావలసింది జాతీయ ప్రభుత్వంకాదు, ప్రజా ప్రభుత్వం అని చాటటం చెయ్యాలి. ప్రజా ప్రభుత్వం అంటే యేంటో, దాని వల్ల ప్రజానీకానికి యేం లభిస్తుందో గ్రామ, గ్రామంలో తిరిగి వారికి తెలియచెప్పాలి. ప్రజలు తమకు కావలసిన ప్రభుత్వ స్వరూపాన్ని తెలుసుకుంటారు. అలాంటి ప్రభుత్వం కోసం వారు తమప్రాణాలైనా యివ్వటానికి సిద్ధపడతారు.

అలా కాకుండా ప్రజాప్రభుత్వం మంచిదనుకున్నంత మాత్రాన ప్రయోజనం లేదు. మన గమ్యస్థానానికిది సాధన. కాని దీన్ని ముందు నిర్మించాలి. ఈ నిర్మాణం ప్రజాస్వామిక శక్తుల మీాద ఆధారపడివుంది. యేదో వొక ప్రభుత్వం వస్తుందిలే

అనుకుంటే అతను నిజమైన ప్రజాస్వామికవాదికాదు. ప్రత్యక్షంగా కాకపోయినా, పరోక్షంగానైనా అతనుకూడా పెట్టుబడిదారుల జాతీయ ప్రభుత్వానికి సహాయంచేసినవాడే అవుతాడు. జాతీయ ప్రభుత్వం పనికిరాదనుకున్నప్పుడు, ప్రజా ప్రభుత్వం అవసరం అనుకున్నప్పుడు అందుకోసం ప్రయత్నించకపోతే యేం ప్రయోజనం ?

కాబట్టి ముందు చేయవలసిన కర్తవ్యం ప్రజల మనసులో నుంచి జాతీయ ప్రభుత్వం అనే మాటను తొలగించి ప్రజా ప్రభుత్వం అనేమాటను చొప్పించాలి. జాతీయ ప్రభుత్వం కావాలనేవారిని నిర్భాగ్యమాటంగా యెక్కడబడితే అక్కడ ప్రతిఘటించాలి. ప్రజలకు ప్రజా ప్రభుత్వంవల్ల వారికి వచ్చేలాభం చెప్పాలి. జాతీయ ప్రభుత్వంవల్లకలిగేనష్టంచెప్పాలి.

సోదరులారా ! యిక నా వుపన్యాసం ముగిస్తున్నాను. చాలావరకు యుద్ధానంతర భారత సమస్యనుగూర్చి చెప్పటానికి ప్రయత్నించాను. యింకా నేను చెప్పని విషయాలు కూడా కొన్ని మిగిలిపోవచ్చు. కాని మంచిచెడ్డలను నిర్ణయించుకోవలసినబాధ్యత మీమీదే వుంది. ప్రతివిషయాన్ని సిద్ధాంత రీత్యా శాస్త్రీయ దృక్పథంతో ఆలోచించండి. ప్రజానీకానికేది మంచిదో అది చేయటం మీ కర్తవ్యం. ప్రజానీకం తమకై తాము నిర్ణయించుకొని ముందుకువచ్చేస్థితిలో లేదు. వారికి మార్గం చూపించాలి. ఆబాధ్యత మీ నెత్తిమీద వుంది. మీరు సక్రమమైన మార్గాన్ని చూపించారా దేశం బాగుపడుతుంది. ప్రజలు మిమ్మల్ని పూజిస్తారు. భావి చరిత్రకారులు సువర్ణాక్షరాలతో మీచరిత్ర వ్రాస్తారు. లేక మీరు తప్పుడు త్రోవ చూపారా ? నేను చెప్పటం అనవసరం.

# ప్రశ్నలు - సమాధానాలు

ప్ర:—జాతీయ ప్రభుత్వం ఫాసిస్టు ప్రభుత్వం యెలా అవుతుంది ?

స:—మీ ప్రశ్నకు యిదివరకే కొంత సమాధానం చెప్పాను. అయినా జాతీయ ప్రభుత్వం ఫాసిస్టు ప్రభుత్వం యెలా అవుతుందనే సందేహం మీకుండవచ్చు. దీనికికారణం మీరు 'యింతవరకూ ప్రపంచంలో యేర్పడ్డ జాతీయ ప్రభుత్వాలన్నీ ఫాసిస్టు ప్రభుత్వాలు కాలేదు. జాతీయప్రభుత్వం జమీందారీ విధానాన్ని పడగొట్టి పెట్టుబడిదారీవర్గం స్థాపించే ప్రభుత్వం. ఇది విప్లవం. పైగా పెట్టుబడిదారీవర్గాలు స్థాపించిన ప్రభుత్వాలన్నీ ఫాసిస్టుప్రభుత్వాలు కాలేదు. యేదో జర్మనీలోనో, యిటలీలోనో యీపని జరిగితే యిండియాలో కూడ జరుగుతుందనటానికి ఆధారం యేంటి ? ఇది అలావుంచి ఫాసిజం పెట్టుబడిదారీ విధానంలోని అంత్యదశ. యిండియాలో పెట్టుబడిదారీవిధానం యింకా బాల్యదశలోనేవుంది. కనుక యిక్కడ ఫాసిజం రావటానికి వీల్లేదని' వుద్దేశపడి వుంటారు.

దీనికి నాకు తెలిసినంతవరకూ సమాధానం చెప్తావినండి. రష్యాలో సోషలిజంవస్తే తక్కిన ప్రపంచంలోని ప్రజానీకం అంతా అలాంటి ప్రభుత్వం కావాలంటుంది. అలాగే జర్మనీలో ఫాసిజంవస్తే తక్కినదేశాల పెట్టుబడిదారీవర్గాలన్నీ అలాంటి ప్రభుత్వాన్నే స్థాపించటం మంచిదనుకొంటవి. కనుక కాపిటలిజం బాల్యదశలోవున్నా, అంత్యదశలోవున్నా పెట్టుబడిదారీ

వర్గం ఫాసిజాన్ని కోరుకోటంలో ఆశ్చర్యంలేదు. యిది అంత ర్జాతీయ పరిస్థితులవల్ల నేర్చుకున్న గుణపాఠం.

అయితే యిక్కడ మీరు అడగవలసినప్రశ్న యిండియాలో పెట్టుబడిదారీవర్గం ఫాసిజాన్ని స్థాపించటానికి పూనుకుంటే నెరవేరుతుందా అని. దీనికి సమాధానం చెప్పేకు నేముందు మీరు తెలుసుకోవలసిన విషయాలు (1) ఫాసిజం అంటే యేంటి? (2) పెట్టుబడదారీవర్గం ఫాసిజాన్ని యెందుకు స్థాపిస్తుంది? వీటికి సమాధానం చెప్పేకుంటే తరువాత యిండియాలో పెట్టుబడిదారీవర్గం ఫాసిజాన్ని స్థాపించటానికి కావలసిన వాతావరణం వుందో, లేదో ఆలోచించటం తేలిక.

పెట్టుబడిదారీవర్గం జమీందారీ విధానాన్ని కూలద్రోసి కాపిటలిస్టు ప్రభుత్వం స్థాపించటం విప్లవమే. ఇది కాదనను. కాని చరిత్రలోఅది యెలా జరిగిందో మీకు తెలుసా? పెట్టుబడి దారీవర్గం వొక్కటే యీపని చేయలేదు. ప్రజానీకాన్ని వెంట వేసుకుంది. ప్రజలు వెంటరావాలంటే వారికి కొంతలాభం చూపించాలి. మొదట ప్రభువు దేవాంశసంభూతుడుగా పరిగణింపబడేవాడు. ప్రభువును ధిక్కరించే హక్కు-వుందని కాని, ఒకప్రభువు దుర్మార్గుడయితే తమ యిష్టంవచ్చినవానిని యెన్నుకోవచ్చునని కాని ప్రజలకు తెలియదు. ప్రజానీకంవేరు, రాజసంతతి వేరుగావుండేది. ఒకవేళ యెక్కడైనా ఒకప్రభువుని తొలగించినా ప్రజలు మళ్లీ అతని కొడుకునో, లేక మరో రాజ సంతతిలోని వాడినో ప్రభువుగా కూర్చోపెట్టేవారు. కాని

ప్రజలు యెలా నిర్మించుకుంటే అలా వుంటుందనే విజ్ఞానం వారికిలేదు.

పెట్టుబడిదారీవర్గం ప్రజల్లో యీ భావాన్ని కల్గించింది. దీనివల్ల సంఘం అంతా తారుమారైంది. అంతవరకూ ప్రజలు నికృష్ట దారిద్ర్యాన్ని అనుభవిస్తున్నారు. ప్రజలకు భూమి మీద హక్కు లేదు. కేవలం రెక్కలకష్టంతో దున్ని పండించటం, పండిందంతా జమీందారుల(ప్రభువులు)కివ్వటం వారివిధి. జమీందారులు వారి ప్రాణాలు నిలిపి, తిరిగి వారి చేత పనిచేయించుకొటానికి కేవలం భుక్తికి సరిపోను వారికి కొంత భత్యం యిస్తూవుండేవారు. పెట్టుబడిదారీవర్గం వీరికి నూతనభావాన్ని, ప్రభువు దేవాంశ సంభూతుడు కాదు, ప్రభుత్వం ప్రజలది అనే భావాన్ని కల్గించేటప్పటికి వీరు పెట్టుబడీదారీవర్గ నాయకత్వంక్రింద జమీందారీవిధానం కూల ద్రోసారు. పెట్టుబడీదారీవర్గం నాయకత్వం వహించటంచేత ప్రభుత్వంకూడా ఆవర్గమే స్థాపించటం జరిగింది.

కాని దీనివల్ల సంఘం చాలా ముందుకువెళ్ళింది. ప్రజాస్వామిక ప్రభుత్వానికి పునాది వేయబడ్డది. అంతవరకున్న నిరంకుశత్వం నాశనంచెయ్యబడ్డది. ప్రజలకు వోటింగుహక్కు లభించింది. ఇంతేకాదు. కాపిటలిజంవల్ల ప్రపంచపరిస్థితులు చాలా మారిపోయినై. కాపిటలిజం ముఖ్యసిద్ధాంతం వుత్పత్తిని యెక్కువచేసి లాభాలకు విక్రయించటం. అయినా దీనివల్ల సంఘానికూడా మేలు జరక్కపోలేదు. వుత్పత్తి యెక్కువగా

జరగాలంటే పారిశ్రామిక అభివృద్ధి జరగాలి. పారిశ్రామిక అభివృద్ధితోపాటు సైన్సు అభివృద్ధిచెందింది. నూతనయంత్రాలు నూతన సాధనాలు కనిపెట్టబడ్డవి. రాకపోక సౌకర్యాలు, రైల్వేలు, పోస్టల్, టెలిగ్రాఫిక్ సౌకర్యాలు యేర్పరచబడ్డవి. విద్యావిధానం ప్రవేశపెట్టబడింది. సంఘంలో ప్రజలంతా వొకరి కష్టసుఖాలు వొకరు తెలుసుకునే అవకాశం యేర్పడ్డది. ప్రజల కొనుగోలుశక్తి, విజ్ఞానం అభివృద్ధి చెందినై. సంఘం యీ పరిస్థితి కొచ్చేటప్పటికి ప్రజల భావాలుకూడా మారుతూ వచ్చినై. స్త్రీ, పురుషులకు సమానహక్కులీయబడ్డవి. ప్రభుత్వం మంచిది కాకపోతే విమర్శించే స్థితికొచ్చారు.తమకు మేలుచేస్తారనే వారికి వోటివ్వటం, తమ కనుకూలమైన ప్రభుత్వాన్ని స్థాపించుకోవాలనే అభిలాష కలగటం, యంత్రాగారాల్లో పనిచేసే కార్మికులు సంఘాలుగా యేర్పడి హెచ్చు జీతాలకోసం, హెచ్చు సౌకర్యాలకోసం ఆందోళన చేయటం జరుగుతూ వచ్చింది. పెట్టుబడిదారీవర్గం లాభాలు సంపాదిస్తున్నంతకాలం ప్రజావొత్తిడిని యెదుర్కోవలసి వచ్చినప్పుడల్లా వారికి కొన్ని హక్కులిస్తూ వచ్చింది. వీటివల్ల ప్రజల్లోయింకా సంఘీభావం యేర్పడటం, తద్వారా యింకా హక్కులకోసం పోరాట్టం జరుగుతూ వచ్చింది. కాపిటలిజంవల్ల యింకో మార్పుకూడ జరిగింది. జమీందారీ యుగంలో ఒకదేశానికీ మరోదేశానికీ, ఒకప్రాంతానికీ, మరో ప్రాంతానికీ హెచ్చు సంబంధంలేదు. కాపిటలిజం అభివృద్ధి చెందినకొద్దీ ప్రపంచం

అంతా, ఒక దేశాని కొక దేశానికి దగ్గరసంబంధం యేర్పడ్డది. అంతర్జాతీయ దృక్పథం ప్రబలింది. ఒక దేశంలో కల్గిన మార్పులు మరో దేశంలో ప్రతిబింబించే అవకాశం యేర్పడ్డది.

యిలా చెప్పటంవల్ల కాపిటలిజమే సంఘానికి అంత్యదశ అని చెప్పటం నా వుద్దేశంకాదు. దీనివల్ల సంఘానికి వెనకటి కంటె చాలా మేలుకలిగింది. సంఘంలో అనేక మార్పులు జరగటంవల్ల ప్రజల భావాల్లోకూడ అనేక మార్పులువచ్చినై. కాపిటలిజంవల్ల సంఘంలో కలగవలసిన మార్పులన్నీ కలిగిన తరువాత, యిక యీవిధానంవల్ల సంఘం ముందుకు పోదనే విశ్వాసం ప్రజల్లో కలిగేటప్పటికి ప్రజానీకానికి దీన్ని కూల ద్రోసి మరో విధానం, అంటే పెట్టుబడిదారీ విధానానికి మారుగా నిజమైన ప్రజాస్వామిక విధానాన్ని—సోషలిస్టు విధానాన్ని స్థాపించటం అవసరంగా కనబడ్డది. పెట్టుబడిదారీ వర్గం నేర్పిన ప్రజాస్వామికం ప్రజానీకంలో ప్రబలిపోయింది. కాని పెట్టుబడిదారీవర్గం సరైన ప్రజాస్వామికం స్థాపించలేదని తెలుసుకునేటప్పటికి ప్రజలకు దాన్ని తొలగించి సరైన ప్రజాస్వామికం స్థాపించే అవసరం కలిగింది.

సంఘం యీపరిస్థితుల్లోకొస్తే పెట్టుబడిదారీవర్గం యేం చేస్తుంది? తన పెత్తనం కాపాడుకోటానికి తంటాలుపడుతుంది. కాని ప్రజానీకం వూరుకోదు. సంఘం యింకా ముందుకు వెళ్ళాలంటుంది. యిదివరకు పెట్టుబడిదారీవర్గం జమీందారీ విధానాన్ని కూలద్రోసి తమ ప్రభుత్వాన్ని స్థాపించుకున్నట్లే

యీసారి ప్రజలు పెట్టుబడిదారీ ప్రభుత్వాన్ని కూలద్రోసి తమ ప్రభుత్వాన్ని స్థాపించుకోటానికి ప్రయత్నిస్తారు. వెనక జరిగిందీవిప్లవమే. యిదికూడా విప్లవమే.

క్రిందటి యుద్ధం తరువాత ఐరోపాఖండంలో, చాలాదేశాల్లో యిలాంటి విప్లవాలు వచ్చినై. వొక్క రష్యాలోతప్ప తక్కిన దేశాల్లో ప్రజలు గెలవలేకపోయారు. అక్కడ విప్లవాలు వోడిపోటానికి కారణం, ఆ దేశాల్లోని పెట్టుబడిదారీవర్గాలు తమ అధికారం నిలుపుకోటానికి తమ శక్తివల్లనో, శక్తి చాలక పోతే యితరదేశాల పెట్టుబడిదారీవర్గాల సహాయంపొందో విప్లవాల్ని అణచివేసినై. రష్యాలోకూడ యిలాగేజరిగింది. కాని అచ్చటిపరిస్థితులు వేరుకావటంచేత విప్లవం నెగ్గింది.

విప్లవం వోడిపోయిన దేశాల్లో తిరిగి పెట్టుబడిదారీవర్గం తమ అధికారాన్ని సుస్థిరం చేసుకోటానికి కొత్తవిధానం కనిపెట్టింది. అదే ఫాసిజం. ఫాసిజం అంటే కేవలం నిరంకుశ ప్రభుత్వం అని చాలామంది వుద్దేశం. కాని యిదే అనుకుంటే అసలు నిజస్థితిని తెలుసుకోలేదనే చెప్పాలి. పెట్టుబడిదారీవర్గం ప్రజలు యెదురు తిరిగి తమప్రభుత్వాన్ని కూలద్రోయటానికి పూనుకున్నప్పుడు ఒక గుణపాఠం నేర్చుకుంది. దానిఫలితంగా ఫాసిజాన్ని స్థాపించింది.

ఆ గుణపాఠం యిది. పెట్టుదారీవిధానంవల్లే ప్రజల్లోనూతన భావాలు కలిగినై. 'రాజు దేవాంశసంభూతుడు కాదు, ప్రభుత్వం ప్రజలది, ప్రజలు యెలానిర్ణయించుకుంటే ప్రభుత్వం

అలావుంటుంది. యిది ప్రజలహక్కు' అనే ప్రజాస్వామిక సూత్రం, రాజకీయ స్వాతంత్ర్యం, వోటింగుహక్కు, స్త్రీ పురుషులకు సమానహక్కులు, విద్య, విజ్ఞానం, కొనుగోలు శక్తి, అంతర్జాతీయ దృక్పథం, కార్మికసంఘాలు — యిలాంటి వన్నీ పెట్టుబడిదారీ విధానంవల్లనే సంభవించినై అని, వీటి వల్లనే ప్రజలు యెదురు తిరగటానికి సాహసిస్తున్నారనీ, యివన్నీ లేకుండా తిరిగి జమీందారీ విధానంలో వున్నట్లే ప్రజలు నేడుకూడా మూఢనమ్మకాలతోనూ, అజ్ఞానంలోనూ వున్నట్లయితే ఆనాడు ప్రభువులు, జమీందారులు యెంత హాయిగా పెత్తనం చేసారో, యీనాడు మనంకూడా అంత సుస్థిరంగా పాతుకుపోవచ్చునని పెట్టుబడిదారులు గ్రహించారు. అంటే వారికి సంఘాన్ని తిరిగి వెనక్కి నడపటం అవసరంగా కనబడ్డది. ఫాసిజాన్ని స్థాపించారంటే పెట్టుబడిదారులు యిదే పనిచేస్తారు.

మీకు క్లుప్తంలో ఫాసిస్టు ప్రభుత్వంక్రిందున్న సంఘాన్ని గూర్చి రెండుముక్కలుకూడా చెప్పటం అవసరం. జర్మనీలో హిట్లరు ప్రభుత్వానికి రాగానే మొట్టమొదట చేసినపని జర్మనీ లైబ్రరీల్లోవున్న వివిధ విజ్ఞానాన్ని బోధించే పుస్తకాలన్నీ తగులపెట్టి వేయించాడు. గొప్పగొప్ప సైంటిస్టులకు, విజ్ఞాన వంతులకు దేశంలో చోటులేకుండా చేసాడు. దేశంలోని భూభాగాన్ని చాలవరకు కొంతమంది వ్యక్తులకిచ్చి జమీందారులను సృష్టించాడు. వున్న విద్యావిధానాన్ని మార్చివేసి

హిట్లరు దేవాంశ సంభూతుడు, నాజీపార్టీకంటె గొప్పపార్టీ, జర్మనీ జాతికంటె గొప్పజాతి లేదనే భావం కలిగించే విద్యని ప్రవేశపెట్టాడు. దేశంలో మరొకపార్టీని లేకుండాచేసి, వార్తా పత్రికలు, సినిమాలు, నాటకాలు ప్రభుత్వాన్ని సమర్థించేటట్లు చేసాడు. జాతీయవాదాన్ని, పరజాతి ద్వేషాన్ని రేకెత్తించి ప్రజానీకాన్ని ఆమత్తులో పెట్టుబడిదారీవర్గంమీాద యెదురు తిరగకుండా చేశాడు. స్త్రీలకు బయటకువచ్చేహక్కు తొలగించబడ్డది. వారికి కేవలం యింట్లోనే స్థానం చూపించబడ్డది. మిలిటరీ విజ్ఞానంతప్ప మరో విజ్ఞానం లేకుండా చెయ్యబడ్డది. ప్రభుత్వాన్ని యెదిరించకూడదు. ప్రజలు చేయవలసినపని తమ విధులు నెరవేర్చటం, జాతీయ ఐక్యత, వర్గసామరస్యం అవసరం అని ప్రజలకు బోధించబడ్డవి. ప్రజలజీవితపరిమాణం హెచ్చుగా వుంచితే ఒకవంక పెట్టుబడిదారులకు లాభాలు రావని, మరో ప్రక్కప్రజల్లో స్వతంత్రభావాలు మళ్లీయేర్పడుతై అని భయం చేతవారి కొనుగోలుశక్తి తగ్గించబడ్డది. పరిశ్రమలన్నీ యుద్ధ పరికరాలకోసం వినియోగించబడ్డవి. ప్రజల దైనందిన అవసరాలకోసం కావలసిన వుత్పత్తి సరుకులు తగ్గించబడ్డవి. అంటే సంఘం తిరిగి జమీందారీ యుగంలోకి నెట్టబడింది.

జర్మనీలో యిలా జరిగిందంటే తక్కిన దేశాల్లోని పెట్టుబడిదారీ వర్గాలు యీ అనుభవాన్ని గ్రహించకపోరు. అది బాల్యదశలోవున్నా, వృద్ధదశలోవున్నా వొకటే. బాల్యదశలో వుంటే వొకవిధంగా ఫాసిజాన్ని త్వరగా స్థాపించటం తేలిక.

కారణం సంఘం పరిపక్వంచెంది ప్రజల్లో నూతనభావాలు విజృంభించవు కనక, యింకా ప్రజల్లో వెనకటి సంప్రదాయాలు మూఢనమ్మకాలు పోవుకనక, మనదేశం యిలాంటి పరిస్థితుల్లోనే వుంది.

మన దేశసాంప్రదాయం చాలాకరకు జమీందారీ విధానంలోనేవుంది. బ్రిటిషుప్రభుత్వం వచ్చినతరువాత యీ నూరు, నూటయేభై సంవత్సరాలనుంచీ కొన్నిమార్పులు జరిగినై. కాని మొత్తంమీద చూస్తే యింకా మనసంఘం జమీందారీ యుగంలోనే వుందని చెప్పాలి. యిలాంటి వాతావరణంలో పెట్టుబడిదారులు ఫాసిజాన్ని స్థాపించటం తేలిక. అంటే ప్రజల్లో నూతనంగావచ్చిన భావాల్ని, ప్రజాస్వామిక సూత్రాల్ని, విజ్ఞానాన్ని నాశనంచేసే అవసరం వారికిలేదు. కారణం యివి మనదేశంలో లేవు. వారు చేయవలసినపని యికముందు సంఘంలో, ప్రజల్లో యిలాంటిమార్పులు రాకుండా చెయ్యటం. యిది చాలా తేలికైనపని.

## గాంధిజం — ఫాసిజం

యిక్కడ మీకు మరోవిషయంకూడా చెప్పటం మంచిది. గాంధీ తత్వం పెట్టుబడిదారులకు మంచి ఆశ్రయం యిస్తుంది. గాంధీ సిద్ధాంతం ప్రకారం బ్రిటిషు ప్రభుత్వం రాకముందు మన సంఘం యెలాంటి పరిస్థితుల్లోవుందో తిరిగి మనం అలాగే వుండాలి. పారిశ్రామిక విప్లవం పనికిరాదు. సైన్సు, పాశ్చాత్య

విజ్ఞానం అసలే పనికిరావు. మనవిజ్ఞానం, మన సాంప్రదాయాలు, మన ఆచారవ్యవహారాలు, మన ఆధ్యాత్మిక సంపత్తు తూ, చా తప్పకుండా ఆచరించాలి. ఇంగ్లీషువిద్య, పరభాషలు పనికి రావు. గృహపరిశ్రమల్ని పోషించాలి. కోర్కెలు చంపుకో వాలి. నిరాడంబరజీవితం సాగించాలి. రాట్నం త్రిప్పుకుంటూ, యే గ్రామాని కా గ్రామం స్వయంసంపూర్ణకత్వం కావాలి. సంఘం యిలాగే అన్నివర్గాలు, రాజులు, జమీందారులూ, రైతులూ, షావుకార్లూ, బీదవాళ్ళూ కలిసి వుండాలి. వర్గ కలహంపనికిరాదు. వర్గసామరస్యం కావాలి.- ఫాసిస్టుసిద్ధాంతం కూడా యిదే బోధిస్తుంది.

గాంధిగారిమీదవున్న భక్తిశ్రద్ధలవల్ల చాలామంది యీ విషయాన్ని గమనించటంలేదు. కాని పెట్టుబడిదారులకు సంఘం యిలావుంటం అవసరం. యిలావుంటే తేలిగ్గా ప్రజల్ని దోచుకోవచ్చు. ప్రజల్ని యేంచేసినా యెదురుతిరిగే స్థితిలో వుండరు. అందుకనే జాతీయ ఐక్యత, జాతీయ వాదం అనే నెపంతో కాంగ్రెసు ప్రక్కచేరి తాళం వేస్తున్నారు. పరజాతి ద్వేషాన్ని రేకెత్తిస్తున్నారు. 'తెల్లజాతి మనల్ని నాశనంచేసింది. యీజాతి రాకముందు మనం యింద్రభోగాల్ని అనుభవిస్తూ వుండేవాళ్లం' అని ప్రచారం చేస్తున్నారు. పాపం; ప్రజలేం చేస్తారు? నిజమే ననుకుంటున్నారు. వెనక మన తాతముత్తా తలు కాశీ వెళ్ళాలంటే యింటిదగ్గర ముందుగానే తిలోదకా లిచ్చి బయలుదేరేవారట. రేపు యీ పెట్టుబడిదారులు ప్రభు

త్వానికొస్తే మనం మళ్ళీ అదేపని చెయ్యాల్సి వొస్తుంది. గాంధీ తత్వం వీరికి సాంఘిక, ఆర్థిక సూత్రాలు నేర్పింది. యిక వీరికి కావలసింది రాజకీయపెత్తనం. అదివస్తే యేం జరుగుతుందో అదే జరుగుతుంది.

కనుక జాతీయప్రభుత్వం అంటే యేంటో, పెట్టుబడిదారీ వర్గం అధికారానికొస్తే యేం జరుగుతుందో మీరు బాగా ఆలోచించుకుంటే, సంఘాన్ని ముందుకు నడిపించాలనే మీకు యీ అనుమానంరాదు. మీరు వొక్కవిషయాన్ని గమనించాలి. జాతీయప్రభుత్వం వస్తే, మనకు ఫక్తు భారతసాంప్రదాయం, హిందూ సాంప్రదాయం కావాలనే ప్రచారం బాగా జరుగుతుంది. నూటయేభై సంవత్సరాలక్రింద, బ్రిటిషుప్రభుత్వం యిక్కడ కాలెట్టకముందు మన సంఘం యేపరిస్థితుల్లోవుందో అదేపరిస్థితుల కెళ్తాం.

2. ప్ర:—యీ యుద్ధంవల్ల యింగ్లండులో పెట్టుబడిధనం తగ్గుతుందని చెప్తున్నారు. అంటే యింగ్లండు ఆర్థికంగా దెబ్బతింటుందన్నమాట. అయితే యుద్ధానంతరం యింగ్లండులో ఫాసిజం రావటానికి అవకాశం యెందుకులేదు?

స:—దీనిక్కూడా యిదివరకే కొంత సమాధానం వచ్చిందనుకుంటాను. అయినా మళ్ళీ విపులంగా చెపుతా వినండి. గత యుద్ధానంతరం ఐరోపాఖండంలో ఫాసిజం యిలాగే వచ్చింది. ఉదాహరణకు తీసుకుందాం. గత యుద్ధఫలితంగా ఇటలీ

జర్మని దేశాలు ఆర్థికంగా దెబ్బతిన్నవి. సంఘం ఆ విషమ పరిస్థితులనుంచి తప్పించుకోవాలంటే, విప్లవం అవసరంగా కనబడ్డది. అంటే, కాపిటలిస్టు విధానంపోయి సోషలిస్టు విధానం రావటం అవసరం. ఆర్థికంగా దెబ్బతిన్న దేశాల్లో విప్లవాలు బయలుదేరినై. కాని అచ్చట పెట్టుబడిదారీవర్గం తమవిధానాన్ని నిలుపుకోటానికి విప్లవాల్ని నాశనంచేసి ఫాసిజం స్థాపించినై. పెట్టుబడిదారీవర్గానికి అంతర్జాతీయబలం వుంది. కాని ఆనాడు విప్లవశక్తులకు అంతర్జాతీయబలం కాని, సహాయం కాని లేదు. కనుక ఆనాడు విప్లవాలు రష్యాలోతప్ప తక్కిన ప్రతి దేశంలోనూ అణచివేయబడ్డవి.

కాని యీనాటి పరిస్థితులువేరు. అంతర్జాతీయంగా ఫాసిజం నాశనం అవుతుంది. విప్లవశక్తులకు అంతర్జాతీయబలం, సహాయం వున్నవి. కనుక అప్పటిలాగా యిప్పుడు అంత తేలిగ్గా విప్లవశక్తుల్ని అణచటానికి వీల్లేదు. యిక యింగ్లండుసంగతి ఆలోచిద్దాం. యీ యుద్ధంవల్ల యింగ్లండు ఆర్థికంగా దెబ్బ తింటుంది' నిజమే. దీనివల్ల పెట్టుబడిధనం తగ్గిపోతుంది. అంటే యింగ్లండులో జరుగుతున్నపని పెట్టుబడిదారీవిధానానికి కావలసినధనం తగ్గిపోతుందన్నమాట. ఒకవిధంగా చూస్తే యిది విప్లవ శక్తులకు అనుకూలం అని చెప్పవచ్చు. కాని మరొక విధంగా గత యుద్ధానంతర పరిస్థితుల్నిబట్టి ఆలోచిస్తే, పెట్టుబడిదారీవర్గం ఫాసిజాన్ని స్థాపించి విప్లవశక్తుల్ని అణచివేయటానికి వీలుందని

చెప్పవచ్చు. యిందులో యేది జరగటానికి వీలుందో మనం ఆలోచించాలి.

విప్లవశక్తులకు వెనకటికంటె యిప్పుడు అంతర్జాతీయంగా బలం యేర్పడింది. రెండోది అంతర్జాతీయంగా ఫాసిజం నాశనం అవుతుంది. మూడోది ప్రజానీకానికి ఫాసిజంవస్తే సంఘం యేస్థితిలో వుంటుందో అనుభవం అయింది. గతయుద్ధానంతరం ఫాసిజం రానంతవరకు ప్రజానీకానికి ఫాసిజంవల్లకలిగేప్రమాదం తెలియదు. యిప్పుడు బాగా అనుభవం కలిగింది. నాలుగోది ఆర్థికదుస్థితినుంచి, పెట్టుబడిదారీ విధానాన్నుంచి సంఘాన్ని రక్షించి యింకా ముందుకు తీసుకెళ్లాలంటే, సంఘంలో యే విధానాన్ని ప్రవేశపెట్టితే మంచిదో ప్రజానీకం తెలుసుకుంది. యిది నేడు రష్యా నేర్పిన గుణపాఠం. యిది నేడు కేవలం శ్రామికవర్గం వొక్కటేకాదు; మానవసంఘాన్ని అభివృద్ధికి తీసుకొని వెళ్ళాలనుకునే ప్రతివాడూ రష్యాలోలాంటి ఆర్థిక విధానం కావాలంటున్నాడు.

ప్రజానీకాన్ని అజ్ఞానంలో అట్టిపెట్టినంతవరకూ యేమైనా చేయటం, వారిని మోసపుచ్చటం తేలికే. కాని వారిలో నూతనభావాలు, నూతన అనుభవాలు కలిగినతరువాత వాటిని అణచటం కష్టం. ఇంగ్లండులోకూడ ప్రజలు నేడు యివే భావాలు, అనుభవాలు కలిగివున్నారు. వాటిని త్రోసివేయటం అంత తేలికైన పనికాదు. యిక్కడ మరో విషయంకూడ

చెప్పటం అవసరం అనుకుంటాను. ఈ యుద్ధమూలకంగా యిష్టంవున్నా, లేకపోయినా ఇంగ్లండులో కొన్ని మార్పులు చేయక తప్పిందికాదు. పెట్టుబడిదారులూ, శ్రామికులూ అనే భేదంలేకుండా యీ యుద్ధభారాన్ని అందరూ సమానంగా వహిస్తున్నారు. వుత్పత్తి కూడా కేవలం పెట్టుబడిదారీవిధానం లోలాగా కాకుండా సంఘంమొత్తంగా వినియోగించబడుతుంది. లాభాలకోసం వుత్పత్తి జరగటంలేదు; సంఘంకోసం జరుగు తుంది. క్రిందటి యుద్ధంలోకూడా యిలాగే జరిగింది. కాని యుద్ధంకాగానే తిరిగి పెట్టుబడిదారీవిధానం అమల్లో పెట్ట బడింది. యీసారికూడా అలానే జరుగుతుందనుకోవచ్చు కాని ఆ అనుభవం ప్రజలకుంది. తిరిగి వెనుకటిలాగా పెట్టు బడిదారీ విధానం అమల్లోకొస్తే యేం జరుగుతుందో ప్రజలకు తెలుసు. కనుక యీసారికూడా అలా జరగనివ్వరు. పైగా యింతకంటెమంచివిధానం వుందని అనుభవపూర్వకంగా తెలుసు కున్నప్పుడు దానికోసం ప్రాణాలు యివ్వటానికైనా సిద్ధపడ తారు. కాని చూస్తూచూస్తూ మళ్ళీ బానిసత్వానికి వొప్పు కోరు.

ఇదంతా కేవలం ఊహాప్రపంచంగా కనబడవచ్చు. కాని 1920 నాటికీ, యిప్పటికీ ప్రపంచపరిస్థితుల్నీ, వున్న తేడానీ గ్రహిస్తే,మీకే అర్థం అవుతుంది. ఫాసిజం యీ యుద్ధానంతరం ప్రపంచంలో మళ్ళీ యెక్కడా స్థాపించబడదని చెప్పటం నా

వుద్దేశంకాదు. ప్రజానీకం యెక్కువ అజ్ఞానంలోవున్న మన దేశంలాంటి దేశంలో ఫాసిజం రావటానికి వీలుంది. కాని యింగ్లండులో అంత తేలిగ్గా వస్తుందనుకోటం పొరపాటు. అంటే యింగ్లండులోని ప్రజలంతా సోషలిజం కావాలంటున్నారని చెప్పటంకూడా నావుద్దేశంకాదు. అక్కడకూడా ఫాసిజం స్థాపించాలని కొంతమంది ప్రయత్నం చేయవచ్చు. కాని వారి ప్రయత్నం యెంతవరకునెగ్గుతుంద నేదే మనప్రశ్న. ఇంగ్లండులో ఫాసిస్టుశక్తులబలం యెక్కువుంటే ఇంగ్లండు యీ యుద్ధాన్ని యింతవరకు సాగించేదేకాదు. యీ యుద్ధఫలితంగా వున్న శక్తులుకూడా నాశనం అవుతున్నవి. ప్రజాస్వామిక శక్తులు అభివృద్ధి చెందుతున్నై. కనుక యుద్ధానంతరం యింగ్లండులో ఫాసిస్టు ప్రభుత్వంకంటె ప్రజాస్వామిక ప్రభుత్వం రావటానికే యెక్కువ అవకాశం వుంది.

---

అచ్చులో

# ప్రపంచ కథలు

## (మొదటిభాగం)

ఫ్రాన్సు, జర్మనీ, రష్యా, చైనా, స్వీడన్, పోలండు, ఐర్లండు, ఇటలీ, యింగ్లండు, జకొస్లొవేకియా దేశాల ప్రఖ్యాత ఆధునిక రచయితల కథలకు చక్కని అనువాదం.

అనువాదం— కె. రాధాకృష్ణమూర్తి బి. ఏ.

సూత్రాశ్రమం
తెనాలి